

BM
బాబూమూవీస్
కన్నెమనసులు
దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు
నిర్మాత. సి. సుందరం
సంగీతం: మహదేవన్
విడుదల

# ఏది తప్పు? ఏది ఒప్పు?

(గతవారం పాఠకుని ఉత్తరానికి జవాబు)

"వింతతెలుగు" అనే వ్యాసం ఆంధ్ర పత్రికలో ప్రచురితమై చాలారోజులై పోయింది. ఇంకా అది పాఠకుల మనస్సులలో మెదులుతోందంటే, దానిని విమర్శించాలని చాలామంది తలంపెట్టుకుంటే, అవ్యాసమూ, నేమూకూడాధన్యులం. విమర్శిస్తే కోపగించే తత్వం కొందరిది. వ్యక్తిగతంగా కాక అభిప్రాయమాత్రమే విమర్శిస్తే అది అందరికీ లాభం.

తెలుగు విభక్తి ప్రత్యయాలమీద "విభక్తులమీద భక్తి" అనే వ్యాసం ఒకటి వ్రాశాను. అది 3—6—66 వ తేదీ ఆంధ్ర సచిత్రవారపత్రికలో ఉత్తరాల శీర్షికలో (పొరబాటువ?) ప్రచురింపబడింది. అసలు ముందుగానే విభక్తుల విషయమై వివరంగా "వింతతెలుగు" లోనే నేనుచర్చించి ఉంటే బాగుండేది. ఏమైతేనేమి, విభక్తులను గురించి మరెవ్వరూ విమర్శ వ్రాయక పోవడంచేత నావాదం నచ్చినట్లుగానే భావిస్తున్నాను.

ఇకపోతే, "భాషను వెనక్కి తీసుకుపోవడం, ఇతర భాషా సంప్రదాయాలను తెచ్చుకుంటే కాని అభివృద్ధి లేదు..." వంటి ఆరోపణలకు సమాధానం చెప్పడం ఉచితమను కుంటాను. "సజీవమైన భాషకు

## ఉత్తరాలు

మార్పు సహజం" అని వింతతెలుగు వ్యాసంలో నేనే వ్రాశాను. కనుక నేను మార్పును అంగీకరించని వాళ్ళజాబితాలో చేరను కదా! పోతే, మార్పు ఎలాఉండాలి అన్నదే వివాదాంశం.

ఇతర భాషలలోనుంచి "మాటలు" ఎన్నైనా తెచ్చుకోవచ్చు. అవసరమైతే తెచ్చుకోవాలి కూడాను. కాని, జాతీయములు, నుడికారములు అరువు తెచ్చుకోవడం సాధ్యంకాదు. అదే పొరబాటు. వాక్య నిర్మాణ పద్ధతి ఉందే, అది ఏభాషకు ఆభాషదే ప్రత్యేకత. ఒక్క ఉదాహరణ: తెలంగాణా ప్రాంతంలో "ఈరోజులలో" "ఈమధ్య" అనే అర్థంలో "ఈవేళ రేపు" అని వాడుతూ ఉంటారు. "ఆజ్ కల్" అనే హిందీ (లేక ఉర్దూ) మాటకు "ఈరోజులలో" అనే అర్థం ఉంది. ఆ హిందీలోని మాటలకు యథానువాదం చేశారు. జాతీయాన్ని ఎరువుతెచ్చుకోవడమంటే ఇదే. అసలు రైటో తప్పో నిర్ణయించడానికి నువ్వెవరనీ, చాలామంది వాడుతున్నారుకనుక అదే సరియైనదనీ అంటే నాదగ్గర సమాధానంలేదు.

తెలుగులో చెప్తే చాలామందికి నమ్మకం కలగదు. కనుక ఇంగ్లీషులో ఒక ఉదాహరణ ఇస్తాను. మన తెలుగువాళ్ళు చాలా మంది (పెద్దపెద్ద చదువులు చదివినవాళ్ళుకూడా) "If you don't think other wise" అని వాడుతూఉంటారు. "మీరు మరోలా అనుకోకపోతే" అనే అచ్చతెనుగుజాతీయానికి ఇది యథానువాదం! కాదంటారా? ఇంగ్లీషులో ఇలా అనకూడదని ఆభాష బాగా తెలిసిన వాళ్ళెరుగుదురు. ఇప్పుడు చెప్పండి, చాలామంది వాడుతున్నారు కనక అది సరియైనదే నంటారా?— మాస్నేహితుడొకడు తెలుగు సామెతలని ఇంగ్లీషులోకి మార్చి వాడేస్తూఉంటాడు. (Island grazing and river swimming, Rain on the buffalo) వగైరాలు దానికేమనాలి? అర్థం అవుతోంది కదా అని సరిగ్గానే ఉందిఅందామా?

ఇంగ్లీషు భాషలోకి వేలకొద్దీ ఇతరభాషా పదాలు వచ్చి చేరాయి. అందువల్ల ఆ భాషకు పుష్టి చేకూరింది. (ఆసంగతి మనం ఈవేళకొత్తగా కనిపెట్టలేదు.) అంతేకాని, ఇతర భాషల జాతీయాలనూ నుడికారాలను, వాక్యక్రమాన్నీ ఇంగ్లీషు భాష చేపట్టలేదు. అది సాధ్యంకాదుకూడా.

ఇకపోతే "ఏభార్య అయితే..... ఆ భార్య...." అనేవాక్య నిర్మాణం ప్రమాదంగా ఉందని చెప్తూ, "ఏపుస్తకానికైతే అట్ట చిరిగిపోయిందో ఆపుస్తకం..." అన్న వాక్య నిర్మాణం బాగులేదంటున్నారు. భేదం కొట్టవచ్చినట్లు కనబడాలనే ఉద్దేశంతోనే ఆవాక్యాలను ఎన్నుకున్నాను. రెండింటిలోనూ వాక్యనిర్మాణం ఒకటే. అయితే రెండూ రైటుఅవాలి. లేకపోతే రెండూ తప్పు అవాలి. ఇటువంటి వాక్యనిర్మాణం పూర్వకవులందరూ వాడుకున్నదే. "ఎవ్వని వాకిట నిభమదపంకంబు రాజభూషణ రజోరాజినడగు" వంటి మహాకవి ప్రయోగాలు ఉన్నాయి. కాని, వాటివిషయంకాదు నేనావ్యాసంలో వ్రాసినది. ఈ నాడు తెలుగు దేశంలో వాడుకలో ఉన్న భాషలో ఇటువంటి ప్రయోగంలేదనీ, అలా వ్రాసినా, మాట్లాడినా కృతకంగా ఉంటుందనీ నాభావం.

ఇటీవల వస్తున్న రచనలలో మంచి పాత్రకు చివర "గారు" చేర్చడాన్ని సమర్థిస్తూ కొందరు వ్రాశారు. నేను నా వ్యాసంలో ఉద్దేశించినది ఒకటిఅయితే విమర్శ మరోదారి పట్టిందని పిస్తోంది. రచయిత కథలో ఒకభాగంకాదు. అతనికి

## ముఖ్య ప్రకటన

రూపాయి విలువ తగ్గింపు వలన పత్రికలకు యేర్పడిన అధిక వ్యయముల భారమును కొంతవరకు సర్దుబాటు చేసికొనుటకై ఇండియన్ అండ్ ఈస్టర్న్ న్యూస్ పేపరు సొసైటీ వారు, తమ సభ్యులైన న్యూస్ పేపర్లన్నింటిలో ప్రకటింపబడు ప్రకటనలపై 1966 ఆగస్టు 1 వ తేదీనుండి 10 పర్సెంట్ సర్ ఛార్జీ విధింపవలసినదిగా ఆదేశించియున్నారు.

ఆంధ్ర దినపత్రిక, ఆంధ్ర సచిత్ర వారపత్రిక — యీ రెండున్నూ పై సొసైటీ సభ్యులు గావున, ఆంధ్ర దినపత్రికలో 1—8—66వ తేదీనుండివెలువడు ప్రకటనలఛార్జీ పైనన్నూ, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 5—8—66 వ తేదీనుండి వెలువడు ప్రకటనల ఛార్జీపైనన్నూ, సదరు సర్ ఛార్జీ విధింపబడగలదని ఇందుమూలముగా ప్రకటనదార్లందరకు తెలియపర్చుకొనడ మైనది.

జనరల్ మేనేజరు.

తప్పక చూడండి! Roopkala







NAV RANG

టైగర్ ప్రొడక్షన్స్ సమర్పించు

ఎ.వి.యం. వారి

# సర్వర్ సుందరం

(తెలుగు)

దర్శకత్వం
కృష్ణన్-పంజు...

నిర్మాత
నెల్లూరు కాంతారావు పహిల్వాన్

పూర్ణా రిలీజ్

# ఉత్తరాలు

అన్ని పాత్రలూ సమానమే. "గారు" ని పాత్రకూ చేర్చవలసిన పనిలేదు. "గారు" చేర్చడంవల్ల ఆపాత్రకు హుందాతనం, పెద్దమనిషి తరహా వస్తాయనుకోవడం పొరబాటు. అవి పాత్రపోషణతో వస్తాయి. కథలోని పాత్రలు ఒకరినొకరు 'గారు' చేర్చి సంబోధిస్తే అదివేరేసంగతి. అంతేగాని రచయిత తానుగా చెప్తున్నప్పుడు (Narration) లో ఈ తోకలు అనవసరం. కొడవటిగంటి, విశ్వనాథ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వంటి ప్రముఖుల రచనలు చూడవచ్చు ఉదాహరణలికి.

"నన్ను అపార్థం చేసుకున్నారు. ఇప్పుడైనా నన్ను అర్థంచేసుకోండి."

మహీధర్ నళినీమోహన్.

కథలు

శ్రీ శివల జగన్నాథరావుగారి "నన్ను నమ్మవూ?" అన్నకథలోని కొన్ని విషయాలనక మేము నమ్మలేం. కథకులు మమ్మల్ని క్షమించాలి దీనికి. మొదటిది నిడదవోలులో కాలేజీ లేదు. ట్యుటోరియల్ కాలేజీ సంగతికాదు. నిడదవోలులోనే బి. ఏ. చదువుతానని నిర్మల పట్టుబట్టింది! ఇదే ఆశ్చర్యం. ఒక్కసారికాదు, మూడుసార్లు చెప్పారు నిడదవోలు లోని కాలేజీ అని!! ఎన్నిసార్లు నమ్మమని ప్రతిమాలినా అసత్యం సత్యం కాజాలదు. కథకోసం ఇంకేదైనా కాలేజీవున్న ఊరిపేరు వ్రాసుండాల్సింది. రెండోది. సినవేత కూతురుకి నిర్మలకు కులాల భేదంతో "ఇంట్లోనే విస్తరివేసి వడ్డించ"లేదు. అలాటి స్నేహితురాలితోనే వియ్యమాడటానికి సీత వెళ్లిందని వ్రాయడం చాల అసహజంగా ఉంది.

'హాస్యవికతకు ఆమడదూరంలో ఉండేదే కథ' అన్న నిర్వచనంతో వ్రాస్తున్నారా నేటి కథలు కొంతమంది అనిపిస్తుంది. విమర్శించడం నా అభిప్రాయంకాదు. అంత సమర్థుణ్ణనీ అనుకోవడంలేదు. 'పత్రిక' చదివే అసంఖ్యాక పాఠకుల్లో ఒకడిగా నా అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నాను.

సి. వి. రాంబాబు (బొంబాయి)

* * *

నేను క్రింద వ్రాయుచున్నది ఒక విమర్శకుని విమర్శకు ప్రతివిమర్శగా వ్రాయుచున్నాను.

"బ్రతుకు భయం" అనే కథను విమర్శిస్తూండి. నరసింహులుగారు హైదరాబాదునందు ఏ హోటలులోనైనా "టీ" పదిహేను పైసలకు తక్కువ ధరకు దొరకదు అలాంటప్పుడు కథలోని పాత్ర ఎలా టీ త్రాగాడు తక్కువ డబ్బుతో అని విమర్శించారు.

రచయిత లేక రచయిత్రికి సహోదరుడుగా నేను సమాధానము రాయడమేమంటే హైదరాబాదులో టీ ధర పదిహేను పైసలకంటే తక్కువగల హోటల్సు చాలా వున్నాయి. తప్పుగా విమర్శించడం అంత మంచిదికాదు. తెలియకుండా విమర్శించడం అంతకంటే తప్పు.

పి. చంద్రశేఖర్ (హైదరాబాదు)

సీరియల్

మీరు ప్రచురించిన "ముద్దమందార" సీరియల్ అత్యుత్తమంగా ఉందికాని రానురాను చదువుతూవుంటే మొదటిలో చదివే ఉత్సాహం పూర్తిగా నశించిపోతున్నది. సింహాచలంతో కూడిన కథను పత్రికలో ప్రచురించినన్నాళ్లు చదవడానికి చాలా రసవత్తరంగా ఉంది. మధ్యలో రాధ పాత్ర ప్రవేశించినప్పటినుంచి కథ అయోమయంగాను, అర్థం లేనట్లు గోచరిస్తున్నది. సింహాచలం కొడుకు రమణను చూడ్డానికి సిగ్గుతో తొంగిపోయే రాధ భర్తను చూస్తే చాలా విహ్యాభావం అనిపిస్తున్నది. సృష్టించే పాత్రలలో తొపిదనం యేమాత్రం లేదు. ఈ విధంగా వుంటే ఈ కథమీద విమర్శలు అంతగా చలామణీ అవుతాయని నాకు నమ్మకం లేదు. కథలో పూర్తి రసవంతం తగ్గిపోయింది. మొదటిలో హృదయాలకు హత్తుకొనేలా హాస్యవికంగాఉన్నా, రానురాను ఈ విధంగా తయారవుతున్నందుకు చాలా విచారంగాఉంది.

కుమారి టూపి అలివేలు (శ్రీకాకుళం)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 29—7—'66

పరాభవనామ సం॥ అధిక శ్రావణ మాసం శు॥ ద్వాదశి

సంపుటము · 58 సంచిక : 48

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధసంవత్సర చందా | 16.00 |


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేననీ, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

## మనలో మాట

'నిరీక్షణ' రచయిత్రి శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మిగారు రాసిన 'అర్ధాంగి' సీరియల్ నవల ఈవారమే ప్రారంభిస్తున్నాము.

*  *  *

'క్లైనరీ' పద్ధతి గురించి కొందరు పాఠకులు తమ సందేహాలని వెలిబుచ్చారు. డాక్టర్ నళినీమోహన్ ఈ సందేహాలని నివృత్తిచేస్తూ రాసిన వ్యాసం ఇదే సంచికలో వేస్తున్నాము...

*  *  *

'తెల్లకోక' కథ తెలంగాణా ప్రాంతాలలో వాడే భాషలో రాసినది! రచయిత ప్రస్తుతం కరీంనగరం జిల్లాలోని పాపాయ్ పల్లెలో ఉంటున్నారు

*  *  *

అన్ని రచనలూ కాగితానికి ఒకవైపున మాత్రమే రాసి ఉండాలి! కథలు, వ్యాసాల రచయితలేకాక ఉత్తరాలు రాసేవారు కూడా ఈ సంగతి గుర్తు ఉంచుకోగలరని ఆశిస్తున్నాము!

*  *  *

పైవారం ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులకి సుపరిచితులయిన ఒక రచయిత ఈ ప్రాంతం స్త్రీలని గురించి రాస్తారు. రచయిత అభిప్రాయాలు మాత్రం వివాదాస్పదంగా ఉండవచ్చు...!

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి కృష్ణకుమారి (ఫోటో : ప్రభాకర్)



రెండు గుర్రాల మీదా
స్వారీ చేయగలననే ఊహ






మిస్టర్! ఇందిరా గాంధీ మాస్కో వెళ్లినప్పట్నుంచీ మన బాస్ చాలా చికాగ్గా ఉన్నారు




రక్షించండి! రక్షించండి!
అధికార వ్యామోహ రాజకీయాలు
వియత్నాం విషయంలో ఇందిర ప్రకటన

# ప్రభుత్వం పొదుపు చెయ్యగలదా?

కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ 'ఎక్సిక్యూటివ్' ఇటీవలే రూపాయి విలువ తగ్గింపుని చర్చించింది. అంతకిముందే వర్కింగ్ కమిటీ ఈ చర్చని జూలయ్ 19కి వాయిదా వేసుకుంది. ఈమధ్యసమయంలో ప్రధానమంత్రి, శ్రీ మొరార్జీదేశాయిలు తయారు చేసిన 'నోట్లు' సభ్యులంతా పరిశీలించాలని వర్కింగ్ కమిటీ ఉద్దేశం. ఈ నోట్లలో విలువ తగ్గింపు ఏ కారణాలవల్ల జరిగిందో, దాని పరిణామాలని ప్రభుత్వం ఏవిధంగా ఎదుర్కోవ నిశ్చయించిందో వివరించివుంది. శ్రీ మొరార్జీదేశాయి తన 'నోట్' లో 16 సూచనల ప్రణాళిక తయారు చేశారు. 'డిఫిసిట్ ఫయినాన్సింగ్' పద్ధతులని వెంటనే ఆపటం, బడ్జెట్లలో మిగులు చూపించటం (రాష్ట్రాలలో కేంద్రాలలో కూడా) ఈ ప్రణాళిక ముఖ్యాంశాలు. ప్రభుత్వం తన ఖర్చులో 10 శాతం తగ్గించుకుంటే ఇది వీలవుతుంది. ఇక పారిశ్రామికరంగంలో ఉత్పత్తిని పరిమితులదాకా అధికం చెయ్యాలి. ఉత్పత్తి అధికం చేసిన పరిశ్రమలకి పన్నుల తగ్గింపులద్వారా 'బహుమతులు' ఏర్పాట్లు చెయ్యాలి. ఎక్సయిజు సుంకాలని బాగా తక్కువచేస్తే ఎగుమతులు ఎక్కువ అయితీరుతాయి. ఈ సూచనలుకాక శ్రీ దేశాయి, వేతనాలని పన్నెండు నెలలదాకా పెంచరాదనీ, పనిచేసేకాలాన్ని పెంచాలనీ కూడా అన్నారు, తమ నోట్‌లో.

కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ తన ప్రభుత్వాన్ని బాగా పురమాయించింది. ఆర్థికశాఖమంత్రి శ్రీ శచీంద్రచవుదరి యూరప్ వెళ్లారు. ప్లానింగ్‌మంత్రి శ్రీ అశోక మెహతా మాస్కో వెళ్లారు. శ్రీ సుబ్రమణ్యమూ మాస్కోకి వెళ్లారు. ఇక విలువ తగ్గింపుపక్షం మాట్లాడేందుకు దేశంలో ప్రధానమంత్రి మాత్రమే మిగిలారు. "తొందరపడి చేసినపని, సందర్భోచితం కాదు" వగయిరా వ్యాఖ్యానాలు కాంగ్రెసువారు కొందరు చేశారు. శ్రీ హెచ్. సి. మాథుర్ దీనిని "హిమాలయాలంత పొరపాటు" అని వర్ణించారు. మాజీమంత్రి శ్రీ హుమయూన్‌కబీర్ సయితం విలువ తగ్గింపు పెద్ద తప్పు అన్నారు. దాని పరిణామాలని సరిగ్గా పరిశీలించకుండా అమలులోకి తీసుకు వచ్చారన్నారు. శ్రీ [illegible]సింగ్, ప్రణాళికలని తయారుచేస్తేవారికి విదేశీ వాణిజ్యం గురించి ఏమీ తెలియదన్నారు. అయినా మంత్రులు మాత్రం తరచు విదేశాలకి వెడుతున్నారన్నారు. శ్రీ రామ్ సుభాగ్‌సింగ్‌గారి మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్‌గారు అమెరికాకి ఎందుకు వెళ్లారో ఎవరికీ తెలియ చెయ్యలేదు.

అధ్యక్షత వహించిన ప్రధానమంత్రి ప్రభుత్వం ఏవిధంగా ధరలని అదుపులో ఉంచటానికి ప్రయత్నిస్తున్నదో వివరించారు. ప్రణాళికలకి సంబంధించవివ్వయంలో పది శాతం తగ్గించటం ఒకసూచన. ప్రభుత్వాన్ని విమర్శించే కాంగ్రెసువారు మాత్రం ఈ సూచనలని అంతగా ఆమోదించకపోవచ్చునని కొందరి అభిప్రాయం. పార్లమెంటు సెషన్లని పరిశీలించేవారికి వీటిలో అనవసరమయిన వివరాల చర్చలలో ఎంతకాలం వృధా అవుతుందో తెలుసు. అసలు పార్లమెంటులో ఖర్చుకి సంబంధించిన వివరాలనే పరిశీలించరు. ఏదయినా గ్రాంటు చర్చకివస్తే, విధానాలని గురించి మాట్లాడుతారుగాని గ్రాంటు మొత్తం గురించి అంతగా పట్టించుకోరు. రెండు సంవత్సరాలు ఈ రకం చర్చలనీ తగ్గించేశారు. పబ్లిక్ ఎకవుంట్స్ కమిటీ, ఎస్టిమేట్స్ కమిటీలు రెండు ఉన్నాయి. వాటి వ్యాఖ్యలని వార్తాపత్రికలు వేస్తాయి తప్ప ఎవరూ లెక్క చేసినట్లు కనిపించదు.

ప్రజల డబ్బుని వినియోగించటంలో శ్రద్ధ, పరిపాలనా పద్ధతులలో సంస్కరణ



జూలై 10వ తేదీన భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి, యుగోస్లేవియా అధ్యక్షుడు మార్షల్ టిటో, శ్రీమతి టిటో బ్రియోని ద్వీపానికి వచ్చినప్పటి ఫోటో.

వచ్చేదాకా పొదుపు అనేది వీలుకాదు. ఒక ఉదాహరణ చెప్తాను—ఒకనాడు హటాత్తుగా ఆరోగ్యశాఖని రెండుగా విభజించారు. ఆరోగ్యశాఖ, కుటుంబ నియంత్రణశాఖ లుగా. కుటుంబ నియంత్రణశాఖకి కొత్త కార్యదర్శిని నియమించి, పెద్ద 'డిపార్ట్మెంట్' ఒకటి సృష్టించారు.

భారత—పాకిస్తాన్ పోరాటంలో రక్షణ సప్లయిశాఖ ఒకటి సృష్టించారు. అది ఇంకా ఎందుకు పడుస్తున్నదో చెప్పటం కష్టం. అలాగే, పెట్రోలియంశాఖని, ఒక కార్యదర్శికోసం, రెండుగా విభజించారు. ఒక మంత్రిగారికోసం 'మినిస్టరీ ఆఫ్ కమ్యూని

# న్యూఢిల్లీ లేఖ

కేషన్స్' అనే శాఖని పుట్టించారు. ఈ మంత్రిగారు తర్వాత గవర్నర్ పదవిని అలంకరించటంతో రెండుభాగాలనీ ఒక మంత్రి కిందికి మార్చినా రెండు భాగాలూ వేరు వేరుగా ఉండిపోయాయి. ఇక పొదుపు ఎక్కడ?

టెలిఫోన్, కార్ల వాడకం తగ్గించాలని సలహాలు వెలువడ్డాయికాని వీటిని పాటించే వారు మాత్రం తక్కువ. న్యూఢిల్లీనుంచి బొంబాయికి పొద్దునే టెలిఫోన్ బుక్ చేస్తే ప్రభుత్వం 'కాల్' లు ఉన్నాయి కాబట్టి అవి అయిన తర్వాతనే వస్తాయని మనకి చెప్తారు స్టాఫ్ కార్ల సంగతంటారా, వాటిని ప్రతి చిన్న పనికీ వాడనివాళ్ళు తక్కువ. ముందు మంత్రివర్గం పరిమాణాన్ని తగ్గించాలి—ప్రస్తుతం మనకి 16 మంత్రులూ, 18 స్టేట్ మంత్రులూ, 19 ఉప మంత్రులూ, వారి కార్యదర్శులూ పర్సనల్ ఎసిస్టెంట్లూ, ఇతర పరివార జనమూ ఉన్నారు. వారి ఉపయోగం, అవసరం తెలుసుకుని తమ విధి నిర్వహించకుండా ఎందరో 'రూపాయి విలువ' గురించి వాదాలు పెంచుకుంటున్నారు. శ్రీ రామ్ సుభాగ్‌సింగ్ ఈ పని బాహాటంగా చేస్తున్నారు. ప్రజలకి ఈ సంగతులని విడమరచి చెప్పేవారు కనిపించటంలేదు. అంతేకాక, వారిలో వారు పోట్లాడుకుని ప్రధాన మంత్రి విధానాలకి అడ్డువస్తున్నారు

రాష్ట్ర ముఖ్యమంత్రులు రాజకీయాలలో ఒక కొత్త 'బలం' అయి కూచున్నారు. ప్రధానమంత్రి ఎన్నికలో కోరలు చూపి రక్తం రుచి చూసిన వీరు తమ అధికారాన్ని చలాయిస్తున్నారు.

* * *

ఎరువుల రాయబారవర్గం 19 వ తారీకుకి భారతదేశానికి తిరిగి వస్తుందిట. దాని నాయకుడు శ్రీ శివరామన్ అమెరికా వ్యవసాయ కార్యదర్శి శ్రీ ఫ్రీమన్‌ని ఢిల్లీలో కలుసుకొనాలి. రసాయనశాఖ కార్యదర్శికి నకుల్‌సేన్‌ని ఇంకొక ఉద్యోగంలోకి మారుస్తున్నారు కాబట్టి ఆయన జపాన్‌కి ఈ రాయబారవర్గం నాయకుడుగా వెయ్యటం భావ్యం కాదని అనుకుంటున్నారుట.

ఇంతలో 'విలువ తగ్గింపు' పరిశ్రమ నిర్మాణాన్నే మార్చేస్తోంది. పారిశ్రామికశాఖ కింద ఉన్న ప్రభుత్వరంగంలోని కర్చులు 64.371 కోట్ల రూపాయలదాకా అధికం అవుతాయుట. కొత్త పెట్టుబడి సంఖ్య 625.067 కోట్ల రూపాయలు. దీనిలో విదేశీద్రవ్యమే రూ. 60.121 కోట్లు. ఇతర ప్రభుత్వరంగంలోని కర్చులు కూడా పెరుగుతున్నాయి. ప్రయివేటురంగంలోని వాటి సంగతి సరేసరి.

ఇవన్నీ ఇలా ఉండగా 90 కోట్ల డాలర్లదాకా ఉంటుందనుకున్న 'కన్సార్టియం' వారి సహాయం విలువ తగ్గింపు జరిగిన నెల రోజులకి కూడా వస్తున్నట్లు ప్రకటన వెలువడలేదు. ●

# అపసరణ సిద్ధాంత స్వరూపం

మోహన్ రామ్

**1944** లో జరిగిన 'ద్రావిడనాడు తీర్మానం' జస్టిస్ పార్టీ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పట్ల తన విశ్వాసాన్ని తెలిపే ప్రకటన. కాని, విచిత్రంగా ఆ తీర్మానమే ఆ పార్టీని బలహీనం చెయ్యటానికి తోడ్పడింది.

విడిపోయిన ద్రావిడ కళగం వారు జస్టిస్ పార్టీ సభ్యులు కొందరు తమ బిరుదులు ('సర్' వగయిరాలు) వదులుకున్నట్లయితే, బ్రిటిష్ వారి అనుచరులుగా ఉండటం మానుకున్నట్లయితే తమ ద్రా. క. పార్టీలో చేర్చుకుంటామన్నారు. జస్టిస్ పార్టీ ప్రముఖులు తమ అంగీకారాన్ని తెలుపలేదు. అందుచేత ద్రా. క. బ్రాహ్మణేతరుల భావాలకి ఏకైక ప్రతినిధి అయిపోయింది.

## జాతీయ వాదానికి విరుద్ధం

ద్రావిడకళగం ఎంతదాకా జాతీయ వాదాన్ని స్వీకరించిందో ఇప్పటికీ, అది ఏర్పడిన ఇన్ని సంవత్సరాల తర్వాత, చెప్పటం కష్టం. ఒకవైపు, "బ్రిటిష్—బ్రాహ్మణ—బనియా మైత్రిని ధ్వంసం చెయ్యాలి" అంటూ జాతీయ వాదులని, బ్రాహ్మణేతరులని సంతృప్తిపరిచారు. మహాత్మాగాంధిని, కాంగ్రెస్‌ని మాక్ష్యంగా దూషించసాగారు. ఉత్తర హిందూదేశంవారు అధిపత్యం చలాయిస్తున్నారనే ఆరోపణ చెయ్యసాగారు. కాని, ద్రావిడ కళగం నాయకుల జాతీయ నినాదాలు వారు యుద్ధ సమయంలో ప్రదర్శించిన ప్రవర్తనకి విరుద్ధంగా ఉండేవి. వారిలో ఎందరో "నేషనల్ వార్ ఫ్రంట్"లో పాల్గొన్నారు. సేలం తీర్మానంలో 'ద్రావిడ నాడు' బ్రిటిష్ వారి పరిపాలన కిందనే కావాలని ఉంది కాబట్టి ఇందులో ఆశ్చర్య పడవలసింది లేదు.

యుద్ధం చివరిరోజుల్లో జాతీయోద్యమం జోరు పెరిగింది. బ్రిటిష్ పరిపాలకులు భారతదేశాన్ని వదిలినా ద్రావిడనాడు ఇచ్చే ధోరణి చూపటం లేదని గ్రహించిన ద్రావిడ కళగం జాతీయోద్యమాన్ని తీవ్రంగా ఖండించటం ప్రారంభించింది. ఉత్తరదేశం వారూ బ్రాహ్మణులూ దక్షిణ ప్రాంతంలోని బ్రాహ్మణేతర జనబాహుళ్యాన్ని పీడిస్తున్న కాలం 'స్వరాజ్యా'నికి అర్థం లేదని



ము. కరుణానిధి

కళగం నాయకులు చెప్పేవారు. జిన్నా కోరే పాకిస్తాన్ ఇవ్వటం అవసరం అనేవారు. ముస్లింలీగ్‌తోనూ, అంబేద్కర్‌గారి 'షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్' తోనూ కలిసి జాతీయోద్యమాన్ని ఎదిరించారు. స్వరాజ్ అనేది మహమ్మదీయులకీ, ద్రావిడులకీ, హరిజనులకీ వర్తించదన్నారు.

అయినా, ద్రావిడోద్యమం బలంగాని, పలుకుబడి గాని తగ్గలేదు సరిగదా క్రమంగా అధికం అవుతూ వచ్చింది. పార్టీ కీర్తితో బాటు ఆ పార్టీలో శ్రీ అన్నాదొరై కీర్తి, దానిమీద ఆయన ప్రభావమూ కూడా ఎక్కువ అవుతూ వచ్చాయి. దీనికి ఒక కారణం సామ్రాజ్యవాదుల భేదోపాయం ఫలించటం మొదలు పెట్టటం, ప్రభుత్వం ప్రోత్సాహంతో ఉన్నత విద్యాభ్యాసం పొందిన బ్రాహ్మణేతర వర్గాలు ఉద్యోగాల కోసం అప్పటికే మంచి పదవులలో ఉన్న బ్రాహ్మణ వర్గాలతో పోటీ పడవలసి రావటమే. శ్రీ రామస్వామినాయకర్ బ్రాహ్మణ ద్వేషం చాలా ప్రముఖ విషయంగా అయిపోయింది.

## వివేక హీనమయిన విధానం

స్వాతంత్ర్యంతో బాటు హిందీ మాతృభాష కాని వారి మీద హిందీని జాతీయ భాషగా రుద్దాలనే విధానం ప్రచారంలోకి వచ్చింది. మద్రాసు రాష్ట్రంలో హిందీ బలవంతంగా ప్రవేశ పెట్టినప్పుడు 'తమిళ సంస్కృతి'కి ప్రమాదం ఏర్పడిందనే నినాదాన్ని ద్రా. క. వెంటనే లేవదీసింది. కే. శ్రీ. సోమసుందర భారతి వంటి కాంగ్రెసు నాయకులకి కూడా ద్రా. క. వివాదాలలో నిజం లేకపోలేదనిపించింది. కాంగ్రెసు దీనిని అంతగా పట్టించుకోలేదు

కాంగ్రెసు పరిస్థితే ఇలా ఉంటే, కమ్యూనిస్టు పార్టీ సంగతి చెప్పనే అక్కరలేదు. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో శ్రీ రణదివే వర్గం వారి బీభత్సకాండలో చిక్కుల్లో ఇరుక్కుపోయింది.

ఈ 'రాజకీయ శూన్యం' లో ద్రా. క. బాగా వృద్ధి పొందింది. స్పష్టమైన లక్ష్యాలు ఆశయాలూ లేకపోయినా 1949 నాటికి బాగా పెరిగింది. ఆ సంవత్సరంలో శ్రీయుతులు ఇ. వి. రామస్వామి నాయకర్, అన్నాదొరై మధ్య స్పర్థలు బయటపడ్డాయి. యువకులందరూ అన్నాదొరై నాయకత్వం పట్ల విశ్వాసం చూపేవారు. పెద్దవారు ఇ. వి. రామస్వామి నాయకర్‌నే ఎక్కువగా గౌరవించేవారు. ఒకవిధంగా ఇది రెండు తరాల మధ్య విరోధం. శ్రీ అన్నాదొరై అధర్యం కిందవుండే చిన్న పత్రికలు ఒక పక్క శ్రీ రామస్వామి నాయకర్ పట్ల జాగ్రత్తగా నడుచుకుంటూనే మరొక పక్క శ్రీ అన్నాదొరైని ఒక 'నేత'గా ప్రశంసించేవి.

## వ్యక్తిగత స్పర్థలు

వ్యక్తిగత స్పర్థలు 1947 లోనే ప్రారంభం అయ్యాయనిపిస్తుంది. శ్రీ అన్నాదొరై కంచీపురంలో తన ఇంటి మీద ఆగస్టు 15 వ తేదీన జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. ఇది ద్రా. క. స్వాతంత్ర్య దినోత్సవాన్ని గుర్తించరాదని చేసిన ఆదేశానికి విరుద్ధం. దానికి తోడు ఆయన ట్యూటికోరన్‌లో జరిగిన పార్టీ సమావేశానికి రాలేదు. తన పార్టీకి ఎంత అవసరమో శ్రీ రామస్వామినాయకర్‌కి తెలియ చెయ్యాలనే ఉద్దేశంతోనే శ్రీ అన్నాదొరై ఇలా చేసి ఉండవచ్చు. కాని, శ్రీ నాయకర్ అరితేరిన

# ఉద్యమంగా మారిన కల్పితకథ

రాజకీయవేత్త. ముందు రాబోయే చిక్కులని పసికట్టి, శ్రీ అన్నాదొరైని ఈరోడ్‌లో జరిగిన పార్టీ ప్రత్యేక సమావేశానికి అధ్యక్షుడినిగా చేశారు. ఈ సమావేశంలో 'హిందీని ప్రతిఘటించే' తీర్మానం అమలు జరిపారు ఇది అన్నాదొరై వర్గంవారికే విజయం అన్నా అతిశయోక్తి లేదు. విరోధాలూ, విభేదాలూ సమసిపోయినట్లు కనిపించినా నిజానికి అవి పెరిగాయి. శ్రీ అన్నాదొరై మరొక కడసారి బల ప్రదర్శనకి, సిద్ధం కాజొచ్చారు. ఆయనకి మంచి అవకాశమే దొరికింది. డెబ్బయి ఏళ్ల ఇ. వి. రామస్వామి నాయకర్ పార్టీ సభ్యురాలయిన శ్రీమతి మణియమ్మని పెళ్లి చేసుకొనటానికి నిశ్చయించుకున్నప్పుడు ఆమె ముప్పయి సంవత్సరాల లోపు వయసు కలది కాబట్టి ఈ వివాహం జరగరాదని అన్నాదొరై, ఆయన అనుచరులు అన్నారు. పార్టీ 'జనరల్ కౌన్సిల్' లోని 44 సభ్యులలో 32 మంది సమావేశమై, వారిలో 31 మంది ఈ పెళ్లి జరుగరాదని తీర్మానించారు. శ్రీ రామస్వామి నాయకర్ అసలు వారిని పట్టించుకోనే లేదు. శ్రీ అన్నాదొరై కొత్త పార్టీకి కావలసిన సన్నాహాలు చెయ్యటం ప్రారంభించారు. మూడునెలలలో 'ద్రావిడ మున్నేట్ర కజగం' అవతరించింది.

ఈ చీలిక, 'రాజకీయాలకి మాత్రం సంబంధించినది', అనలేము. ద్రా. ము. క. విధానాలకీ, ద్రా. క. విధానాలకీ భేదం ఉండేదికాదు. కాని, నిర్మాణంలోనూ, చేష్టలలోనూ ద్రావిడ మున్నేట్రకజగం నియంతృత్వపు అవివేకపుటంచుల మీదనున్న మధ్యతరగతి పార్టీ లక్షణాలని బాగా ప్రదర్శించేది.

ద్రా. ము. క. నాయకులు తమది కేవలం ఒక రాజకీయ పక్షం కాదనీ, సంఘ సంస్కరణాన్నే ప్రధాన లక్ష్యంగా కల మహోద్యమం అనీ ప్రచారం చేసేవారు. ఇందులో నిజం చాలా తక్కువ. కాని, ప్రచారం బాగా పని చేసింది. ద్రా. ము. క. నాయకులు ఎదురు చూడనంతగా పని చేసింది.

## కాంగ్రెసుపట్ల అసంతృప్తి

1949—52ల మధ్య తమిళనాడులో జనంలో కాంగ్రెసు పరిపాలన పట్ల చాలా అసంతృప్తి, అపనమ్మకం కలిగాయి అనవచ్చు. కాంగ్రెసు పార్టీ జనసామాన్యాన్ని అవసరం అయినంతగా పట్టించుకోలేదనీ అనవచ్చు. కమ్యూనిస్టులు అజ్ఞాతవాసంలో ఉన్నారు. ద్రా. ము. క. వారి స్థానాన్ని ఆక్రమించాలని అనుకున్నది. దాని నాయకులు సోషలిజం, కమ్యూనిజం, విప్లవం, సంఘసంస్కర—వీటిని గురించి అస్పష్టంగా మాట్లాడేవారు. చరిత్రలోని మేధావులందరికీ తాము శిష్యులమని చెప్పుకునేవారు. బజారు వక్తలు అనర్గళంగా ఉపన్యాసాలు దంచేవారు. సాక్రెటీస్, ప్లేటోల నుంచి, మాకియవెల్లి, ఇంగర్‌సాల్‌ల దాకా ఉదహరించేవారు. లెనిన్, హిట్లర్‌లని ఉదహరించేవారు. కాని, వీలయినప్పుడెల్లా కమ్యూనిస్టు దూషణతో గోబెల్స్ దోరణిలో శ్రోతలని రెచ్చగొట్టటానికి ప్రయత్నించేవారు.

దీనికి తోడు పార్టీ ప్రచారకులు పరోక్షంగా ఎన్నోవిధాల వ్యక్తిపూజని నెలకొల్పటానికి ప్రయత్నించేవారు. బహుశ, మరే పార్టీలోనూ ఇంత వ్యక్తిపూజ ఉండదేమో. ఒక్కొక్కరుగా పార్టీ నాయకులు సినిమా పరిశ్రమలో రచయితలుగా ప్రవేశించటం మొదలుపెట్టారు. ఇది వారికి దొరికిన కొత్త అవసరణ సిద్ధాంత ప్రచార సాధనాలలో ఒకటి.

ప్రారంభదశలలో ద్రా. ము. క. ముఖ్యంగా 'చిన్న బూర్జువా' పార్టీ. ఇందులో అధికంగా, కొద్దోగొప్పో విద్యాభ్యాసం కల మధ్యతరగతి వారే ఉండేవారు. ఒక విధంగా ద్రా. ము. క. మధ్యతరగతి వారి నిరాశని ప్రతిబింబించేది. ఈ నిరాశని వాడుకునే ప్రతి రాజకీయ అవకాశవాదీ చిన్న ద్రావిడమున్నేట్ర కజగం నాయకుడుగా అవతరించేవాడు. ఈ పార్టీ ప్రభావం ఎక్కువగా బస్తీ ప్రాంతాలలో, అందులో



# అపసరణ సిద్ధాంత స్వరూపం

మద్రాసు నగరం, దాని పరిసరాలలోనే ఉండేది. ఈ ప్రాంతాలలోనే జాతీయోద్యమం చాలా బలహీనంగా ఉండేది. కాని, క్రమంగా ద్రా. ము. క. విద్యార్థులని ఆకర్షించి వారి ద్వారా గ్రామ ప్రదేశాలకీ పాకటం ప్రారంభించింది, ముఖ్యంగా హరిజన వర్గాలలో—అంటే, ద్రా. ము. క. హరిజనుల కోసం హృదయపూర్వకంగా కృషి చేసిందనికాదు అసలు ఈ పార్టీకి మంచి సాంఘిక ఆర్థిక పథకం ఎప్పుడూ లేదు—గ్రామప్రాంతాలలో దాని సభ్యులు సాధారణంగా మధ్యతరగతి రైతు కుటుంబాలకి చెందినవారుగానే ఉండేవారు. వీరి పొలాలలో హరిజనులు పని చేస్తూ ఉండేవారు. తక్కిన ఈ రకం ఉద్యమాలలో లాగే ద్రా. ము. క. తిరుగుబాటులో కూడా పాలకవర్గం మీద ఎదురు తిరిగిన వారు చాలామంది ఆ వర్గాలకి చెందిన వ్యక్తులే. మొదట ద్రా. ము. క. నాయకులు చాలామంది మొదలియార్ కులస్థులే. వ్యాపారం వీరెప్పుడూ 'అభివృద్ధి చెందిన' వర్గం కిందనే లెక్క. ఇక ప్రభుత్వోద్యోగాలలో బ్రాహ్మణులు తప్ప తక్కిన వారందరి కన్నా ముందు ఉండేవారు. అందుకనే కొందరు, ద్రా. ము. క. ని 'ద్రావిడ మొదలియార్ కళగం' అని హేళన చేసేవారు.

## స్వలాభాన్వేషణ

ద్రా. ము. క. సిద్ధాంతాలు కులాభిమానాలలో నుంచి జన్మించినవే కాని ఈ సిద్ధాంతాల నుంచి పుట్టిన విధానాలు స్వలాభాన్వేషణ మీద ఆధారపడి ఉండేవి. తర్వాత, తర్వాత పార్టీ పెరిగిన పిదప, కొన్ని విరుద్ధమైన కారణాల మూలంగా పరిపాలక వర్గాలూ, వారిచే పరిపాలింపబడే వర్గాలూ కలిశాయి. స్వలాభాన్వేషణ దీనికి చాలా తోడ్పడినా ఎన్నో అవకతవకలు బయట పడుతూనే ఉండేవి. ఇవి రాజకీయ శాస్త్రజ్ఞులకీ, సాంఘిక శాస్త్రజ్ఞులకీ కూడా ఆశ్చర్యం, సందేహం కలిగించక మానవు.

1952 లో ద్రా. ము. క. పెద్దపార్టీ అయిపోయింది. కాని, తాము ఉత్త రాజకీయ పక్షం కామన్న దీని నాయకులు అప్పటి ఎన్నికలలో వివాదంతో పాల్గొనాలో సరిగ్గా నిర్ణయించుకోలేకపోయారు. 'ద్రావిడనాడు' కావాలనే కోరికని స్పష్టంగా చెప్పటానికి ఇబ్బంది పడ్డారు. అందుకని, గడుసుగా, స్వతంత్ర ద్రావిడనాడు కోసం పోరాడే అభ్యర్థులని బలపరుస్తామన్నారు. సుమారు 60 మంది స్వతంత్రంగా నిలిచిన అభ్యర్థులూ, కులాభిమానాల మీద నిలిచే 'తమిళనాడు టాయిలర్స్ పార్టీ' వారూ, 'కామన్‌వాల్ పార్టీ' వారూ వారిలో ప్రముఖులు—ఈ ఒప్పందానికి అంగీకరించారు. కమ్యూనిస్టులు ద్రావిడనాడు కోరికని బలపరచమన్నారు కాని ఒక్క అభ్యర్థిని కూడా నిలబెట్టని ద్రావిడ కళగం వారిని ఏ షరతూ లేకుండానే బలపరుస్తానన్నది. ద్రా. ము. క. నేరుగా తన బలాన్ని పరిశీలించుకునే బదులు పరోక్షంగా ఇలా పరిశీలించుకుంటోందని ఈ ఒప్పందాల అర్థం.

## చిందరవందర

కాంగ్రెసు ఆంధ్రప్రదేశ్‌లో, మలబార్‌లో బాగా దెబ్బతిన్నది. తమిళనాడులో ఫరవా లేదనిపించుకున్నది. ద్రా. ము. క. బలపరిచిన అభ్యర్థులలో చాలామంది ఓడిపోయారు. కులాభిమానాన్ని చాటే రెండు సన్నియ పార్టీలు మాత్రం బాగానే గెలిచాయి. వారి గెలుపులకి కులాభిమానాలే కారణం అని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. 375 మంది ఉండే శాసనసభలో కాంగ్రెసుకి పూర్తి మెజారిటీ లేకపోయినా శ్రీ రాజగోపాలాచారిని 'లెజిస్లేచర్ కాంగ్రెస్ పార్టీ' నాయకునిగా ఎన్నుకున్నారు. ప్రతిపక్షం వారందరూ కలిసి మిశ్రమమయిన 'యునైటెడ్ డెమోక్రెటిక్ పార్టీ'గా ఏర్పడ్డారు. తమకే మెజారిటీ ఉందన్నారు. శ్రీ మాణిక్యవేలు నాయకర్ ఆధిపత్యం కింద 'కామన్‌వాల్ పార్టీ' తటస్థంగా ఉండిపోయింది. శ్రీ రాజాజీ దీనిని వెంటనే సద్వినియోగం చేసుకున్నారు. శ్రీ మాణిక్యవేలు నాయకర్ మంత్రివర్గంలోకి తీసుకుని, మిగతా శాసనసభ్యులందరినీ కాంగ్రెసు వైపుకి మళ్ళించారు. ద్రా. ము. క. బాగా చిందర వందర అయిపోయింది. తమ సహాయంతో గెలిచిన శాసనసభ్యులలో కూడా కొందరు కాంగ్రెసు వైపుకి వెళ్ళిపోయారు. కమ్యూనిస్టులు ద్రావిడకళగం సహాయంతో 14 సీట్లు గెలుచుకున్నారు.

అయితే, ఈ అపజయం అపసరణ సిద్ధాంతానికి అపజయం అని మాత్రం ఊహించరాదు. ద్రా. ము. క. ఎన్నోరంగాలలో తనబలాన్ని నిరూపించుకుంది.

(సశేషం)

# నిరుద్యోగపర్వం



## ఉద్యోగాపహరణం

వేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ

మయసభలో అవమానింప బడి బహుమానం దొరకదని విశ్రమించుకున్న నిరుద్యోగి సభబయటికొచ్చి ఆలోచించాడు. మళ్లీ యింటికి తిరిగి వెళ్లడం ఎలా? తిరిగి పోయేందుకు డబ్బులున్నా ఈ ప్రశ్న పెద్ద సమస్యయిపోయింది. డబ్బులున్నా యింటికి పోవడం కష్టం అని యిపుడే తెలుసుకున్నాడు. 'ఏముఖం పెట్టుకుని యీముఖం చూపించాలి? నాకేది దారి?' అని వాపోయాడు. టై విప్పదీసి [illegible] మడిచి సంచిలో పెట్టేసి బయటికి [illegible] తీశాడు. ఆఫీసావరణ [illegible]ండగా కలిశాడొకడు. యితడో చిరుద్యోగి. [illegible] ఆఫీసులోనే ఒక చిన్న వుద్యోగం చేస్తున్నాడు. ఆమాటా యీ మాటా అయ్యాక చిరుద్యోగి నిరుద్యోగితో [illegible], 'యింతకు ఉద్యోగం విషయం ఏమయింది?' అని. మళ్లీ అతగాడే అన్నాడు, 'అయినా అప్పుడే ఏంతేల్తుంది లెండి' అన్న

'ఇంకా ఏంతేలటం లేదండీ? మునిగే పోయింది. యింటర్వ్యూలో మనది చాలా పూర్ పెర్ఫార్మెన్స్' అన్నాడు నిరుద్యోగి. చిరుద్యోగి చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆమాటే నోటితో అన్నాడు, 'మిమ్మల్ని చూసి నేను చాలా ఆశ్చర్యపడుతున్నాను సుమండీ' అని.

'ఏం' అన్నాడు నిరుద్యోగి.

చిరుద్యోగి లేచాడు. కాస్సేపాగిఅన్నాడు. 'ఈ యింటర్వ్యూలో తేలేదేమీ లేదు దీంతోనే అంతా మాటుంచి, ఎంతో కొంతైనా లాభముందనుకుంటే మీరు అపోహపడ్డట్టే'.

నిరుద్యోగి ఆలోచించాడు. 'అవును, నేను అపోహపడ్డాను' అనుకున్నాడు. 'అందుకే చిరుద్యోగి ఆశ్చర్యపడ్డాడు' అనుకున్నాడు.

'మీకు అనుభవం తక్కువ' అన్నాడు చిరుద్యోగి. పదినిమిషాలు స్టడీ చేసి చిరుద్యోగి కనిపెట్టిన పెద్ద రహస్యం అది.

యింకా సైగా ఒప్పుకోండన్నాడు. నిరుద్యోగి 'అవున'న్నాడు. ఒప్పుకున్నానన్నాడు.

'అయితే యీ యింటర్వ్యూలో అనలేంకాదా?' అని సంశయనివృత్తి కోసం అడిగాడు నిరుద్యోగి. చిరుద్యోగి చిరుకోపం ప్రదర్శించాడు, 'మీకేం వన్నా పిచ్చెక్కిందా? నేం చెప్పేదేమీ మీకు తలకెక్కలేదన్నమాట' అన్నాడు.

'ఎక్కింది' అని సమాధాన మిచ్చాడు నిరుద్యోగి.

'ఏమిటి? పిచ్చా' అంటూ ఘొల్లున నవ్వాడు చిరుద్యోగి. నిరుద్యోగి ఆశ్చర్యపోయాడు. ఆశ్చర్యపడి,

'మీక్కూడా ఆఫీసర్లా నవ్వవచ్చునా?' అనడిగాడు.

'ఏం, యింతకంటె ఎక్కువగా నవ్వుతారా ఏం ఆఫీసర్లు. నేనసలు ఆఫీసరవ్వాల్సిన వాణ్ణే కదూ?'.. ఘొల్లుమన్నాడు చిరుద్యోగి. యిది అకారణంగా నవ్విన నవ్వు. యిపుడసలు నవ్వాల్సిన మాట లేదు. నవ్వాల్సిన అవసరంలేదు. అయినా చిరుద్యోగి నవ్వాడు. యిలా సంభాషణలో నవ్వులపాలు ఎక్కువయ్యేటట్లు కనుపించి తను యింటికి పోయాక నవ్వులపాలుకాకుండా వుండేందుకు ఉపాయం అడగటానికి సమయం వుండేట్టు కన్పించ లేదు. చిరుద్యోగి వుద్యోగం చిన్నదయినా అనుభవం పెద్దది.... అనుభవం కొన్ని అడిగి పుచ్చుకోవాలనుకున్నాడు నిరుద్యోగి. కాఫీహోటలుకు లాక్కెళ్లాడు.

'స్వామీ? మీముఖం చూస్తుంటే ఉద్యోగానికి దారి యింటర్వ్యూనే కాకుండా యింకా ఏదో ఉన్నట్టు తోస్తోంది. అసలు యింటర్వ్యూ ఒకదారే కాదని అనుమానం కూడా వేస్తోంది. ...... నేను నిరుద్యోగ బాధపళ్లేను' అని కళ్లు తుడుచుకున్నాడు నిరుద్యోగి. సర్వరు రెండు కాఫీలు తెచ్చాడు. కాఫీ చప్పరిస్తూ చిరుద్యోగి విలాసంగా చెప్పసాగాడు.

'మీబాధ నాకర్థమయింది. నేనూ అనుభవించాను గదండీ. చాలా కష్టం యీ నిరుద్యోగం అనేది. ఈ ప్రపంచంలో ఆరుగురు దుఃఖభాగుల్లోనూ నిరుద్యోగి మొదటివాడు. మిగతా అయిదుగురూ ఎవరో చెప్పండి'.

నిరుద్యోగి నిరాశపడ్డాడు. 'స్వామీ మళ్లీ మీయింటర్వ్యూనా?' అన్నాడు.

'యిది యింటర్వ్యూకాదు. తెలియక

పోతే కంగారు తినకండి. కాఫీ త్రాగండి. మిగతావాళ్ళవలో నేను చెబుతాను' అని బుజ్జగించాడు చిరుద్యోగి. అయినా నిరుద్యోగికేవేం నచ్చలేదు. అతనిది ముక్కుసూటిగాపోయే స్వభావం. రోడ్డువంపులు గావుంటే సహించడు. కాని చిరుద్యోగి మనస్తత్వం యిందుకు పూర్తిగా విరుద్ధం. ఏవిషయం చెప్పినా తలదగ్గరో తోకదగ్గరో మొదలెట్టి తోకదాకా తలదాకాపోందే పూరుకోడు. తలాతోకాలేకుండా ఏవిటా కబుర్లంటారని భయం. పైగా అనుభవజ్ఞుడు. కొందరనగా విన్నాడీమాట. అందుకనే ఏవిషయం అయినా కూలంకషంగా చర్చించి వివరిస్తాడు. చిరుద్యోగి కొనసాగించాడు.

'నిరుద్యోగి, నిత్యబొంకితుడు, పరోద్యోగోపజీవి, బుణాతువు, నిరుత్సాహవంతుడు చిరుద్యోగి, అనునీనార్వురు దుఃఖభాగులు. వచ్చినచిక్కేవిటంటే యిందులో నిరుద్యోగి గిరీ పుచ్చుకున్నవాడుతప్ప మిగతావాళ్ళకీ ఒక్కొక్కటో, లేక రెండోపదవులువుంటయ్. కానీ యీ నిరుద్యోగిగిరీ పుచ్చుకున్న వాడు మిగతావాటినికూడా పుచ్చుకోవాలి. పుచ్చుకుంటాడుకూడా....'

నిరుద్యోగి చికాకు పడ్డాడు. 'అయ్యా, మీరు మాకు గురువులు. తెలిసినవిషయాలే చెబుతే మీకు గురుత్వం రాదు. నాకు శిష్యరికంరాదు....... ఉద్యోగానికి మిగతా ముఖ్య దారులేవో చెప్పండి. రహదార్లు కాకపోయినా ఫర్వాలేదు. మీరిందులో సిద్ధహస్తులని నాఅనుమానం. నాకు ఉద్యోగం సిద్ధించే ఉపాయం చెప్పండి,' అని వేడుకున్నాడు.

చిరుద్యోగికి కోపం వచ్చింది తొందరపెట్టినందుకు. అయినా కాఫీతాగిన సంగతి గుర్తుకొచ్చి మెల్లగా చెప్పసాగాడు.

'అట్లా తొందరపడితే ఏవనవుతుందయ్యా? ఏవనీ అవ్వదు. నేను చెప్పే విషయం ఎవరి దగ్గరా అనకండి. అన్నా నేనన్నానని చెప్పొద్దు....... ఈ ఉద్యోగ సంపాదనలో మొదట గ్రహించాల్సిన విషయం ఏవిటంటే—యింటర్వ్యూల్లో ఏమాత్రం ఆశపెట్టుకోకూడదు, లాభంలేదు కాబట్టి. యికపోతే మూడు కిటుకులున్నయ్. ఒడుపు, ఏడుపు, ముడుపు అని మూడురకాలు. ఈమూడింటినీ వెనకా ముందుగా ఉపయోగించాల్సి, మనిషినిబట్టి మారుస్తూ వుండాలి. ముందు ఒడుపును గురించి చెప్పుతాను.'

'ఈఒడుపు అనేదసలు చిన్నప్పట్నించీ రావాలి. నేర్చుకుంటె వచ్చేదికాదు. అయినా నేర్చుకున్నవాళ్ళూకొందరు లేకపోలేదు. యిది ప్రయోగింపబడే వ్యక్తి దగ్గరకువెళ్ళి 'నువ్వంతవాడివి, యింతవాడివి' అని 'నువ్వెంత' అని పైకెత్తెయ్యాలి. 'అబ్బే, నేనెంతవాణ్ణి' అంటె—అంటాడు తప్పకుండా—వదినట్టే నీవలలో. అలా అనేయటంతో నీపనయిపోతుంది. మిగతాదిఅతనే పూర్తిచేస్తాడు. దాంతో నీపనయిపోతుంది. ఒకవేళ నువ్వు వకసారన్నాక లాభంలేదన్నాడనుకో మళ్లీ యింకో ఘాటను..... యిపుడూ వీల్లేకపోతే యింకోమాటను....'

'అబ్బే, రెండుసార్లా ఒకేమనిషిని' సంశయించాడు నిరుద్యోగి.

'ఒకేమనిషిని మళ్లీఅడక్కుండా రెండోవాణ్ణడిగితే రెండుసార్లెందుకడిగినట్లవుతుంది...... అయినానేచెప్పేదదికాదు. యింకోమాటడుగంటే యింకో విషయం అడగమని అర్థం కానీ మళ్లీ అడగమనర్థం కాదు. యింకో మాటడగాల్సిందేవిటంటే "మీ ఆఫీసులో ఎంతతక్కువ ఉద్యోగమైనాసరే యివ్వమనటం". మీ అంతవాళ్లదగ్గిర పనిచెయ్యాలనుందనటం...... దీనికి తప్పకుండా వప్పుకుంటాడు. నా కట్లాగే వచ్చింది చిరుద్యోగం.'

'యిక పోతే రెండోది—ఏడుపు. యిది మాటికి తొంభైకేసుల్లో సక్సెస్సవుతుంది. దానికింత విజయానిక్కారణం ఏవిటంటే మానవుల్లో ఎంత ప్రచండుడికైనా కొంత మానవత్వం వుంటుందిటోమూలా. మానవత్వానికి ఏడుపుకీ మాంచి సన్నిహితం. నిరుద్యోగికీ నిట్టూర్పుకీ వున్నంతదూరం. మానవత్వానికి ఏడుపు వినిపించిందంటే చాలు, యింతమొహం చేసుకుని అవతలివాడి హృదయం అంతా ఆక్రమించు కుంటుంది. అపుడు నువ్వుచెప్పేదంతా — ఏడుస్తూ చెప్పేదంతా—చేసి పారేస్తాడు. ఏడుపు ఆపాో నీఆటకట్టు. వాడిబెట్టుపెరుగుతుంది. అందుకనిమధ్యలో వాడు మర్యాదకి ఏడుపు ఆపమన్నా ఆపకూడదు. లేకపోతే ఆపమనంగానే ఆపే ఏడుపు ఒకఏడుపు కాదని అపోహపడ్తాడు........ యిది దివ్యాస్త్రం.

'యికముడుపు. యిది మాటికి నూరు కేసుల్లోనూ సక్సెస్సవుతుంది. దేవుళ్లు కూడా దీనికి బద్దులు. యిది ప్రయోగిస్తే ఏపనైనా చేస్తారు. ఉద్యోగాన్నిబట్టి రేటు. క్లర్కుదగ్గర్నుంచి ఆఫీసరుదాకావేరువేరురేట్లు. కానీ వోవిషయం గుర్తుంచుకోవాలి. డబ్బిస్తున్నాం గదా అని ధీమాగా ప్రవర్తించకూడదు. డబ్బిచ్చి చేయించుకున్నా పూరికే చేయించుకున్నట్లే భావించాలి. అదిముఖ్యం. కాబటినిర్మ్యోద్యోగీ! యివీకిటుకులు. యీ కిటుకుల్లో ఏదుపయోగించినా చిటికెల్లో పనవుతుంది. యిక నీవోపికకొద్దీ వీటిల్లో ఏదోవకటి వుపయోగించు' అని చెప్పేసి చక్కాపోయాడు చిరుద్యోగి.

జ్ఞానోదయమైన నిరుద్యోగి సంతోషంగావెళ్ళి పోయాడు. కానీ ఇంకో సందేహం వచ్చింది. యీ మూడింటిలోఏది ఉపయోగించాలి అని. ఒడుపుఅన్నదాన్ని ఆఫీసర్ల దగ్గరెప్పుడూ వుపయోగించలేదు నిరుద్యోగి. బామ్మదగ్గిర ఒడుపు ఒడుపుకింద లెక్కకాదు. అమాటకొస్తే వొడుపు ఆఫీసర్లదగ్గిర కూడా ఉపయోగించవచ్చని యిప్పుడే తెల్సుకున్నాడు. అందుకని ఆ అస్త్రాన్ని ఉపయోగించదల్చుకోలేదు. యిక ముడుపు బొటా బొటీగా లెక్కకట్టి యిచ్చారు యింటిదగ్గిర డబ్బు. ముడుపుకడ్తానికేం కనుపించలేదు. అందుకని యికమిగిలిందీ రెండోదే శరణ్యం అనుకున్నాడు. పార్కులోకి వెళ్ళి రెండుమూడుసార్లు రిహార్సల్సు వేసుకున్నాడు. వక్కనే పోతున్నవాళ్ళడిగారు. 'మీఏడుపుక్కారణం ఏవిటని?' 'మీకేంపని? నాఏడుపు నన్నేడ్చుకోనీండ'ని కసురుకున్నాడు. వాళ్లువెళ్లిపోయారు. [illegible] సరి యిందాక యింటర్వ్యూ చేసిన ఆఫీసర్లలో వోఆఫీసరుయిల్లు కనుక్కొని యింటికెళ్లాడు.

'ఎవరండీ మీర'ని అడిగాడు ఆఫీసరు. నిరుద్యోగి మాట్లాడలేదు. పైగాఏడ్చాడు; ఆఫీసరు అదోలా చూశాడు. చూసి, 'కొత్తవాడివి వుత్తపుణ్యాని కేడుస్తావెందుకు?' అన్నాడు. నిరుద్యోగిమాటలు విన్నాడు. కానీ ఏడుపు మానలేదు.

'ఉత్త పుణ్యానికెందు కేడుస్తానండీ? అయినా ఎవరు మాత్రం పూరికే ఎందుకేడుస్తారు?' అన్నాడు......... ఏడుస్తూనే చెప్పాడు తనసోదంతా. '......సినిమాక్కూడా డబ్బులు దొరకవండి వొక్కొక్కప్పుడు' అంటూ ఆపుచేశాడు. ఆఫీసరు

# నిరుద్యోగపర్వం

జాలిపడ్డాడు. ...నిరుద్యోగి ఏడుపుమాన లేదు.......ఆఫీసరు ఆలోచిస్తున్నాడు. నిరుద్యోగి ఏడుపు వినిపిస్తున్నాడు..... ఏడుస్తూనే మధ్యలో అన్నాడు, 'ఒకోప్పుడు ఆత్మహత్య కూడా చేసుకోవాలనిపిస్తుంటుందండి' అని.



'అయ్యో' అనుకున్నారు ఆఫీసరు గారు మనస్సులో. ఈ ఆఫీసర్లింతే. జాలి పడ్డం కూడా హుందాగానే పడ్తారు. వద్దిగ్గా పడరు. అంతా ప్రయివేటే.... ఆలోచించి ఆఖరికి—

'సరే, చూద్దాం' అన్నాడు ఆఫీసరు గారు.

'ఏవిటండీ? ఆత్మహత్యా?' అన్నాడు నిరుద్యోగి.

'కాదయ్యా! ఉద్యోగంసంగతే. ఆలోచిద్దాం' అన్నాడు.

'చేసుకూడా ఎందుకండీ? అయినా ఆలోచించాల్సిన పనేముందండీ యిందులో. యీ వుద్యోగం మీచేతుల్లోవుంది. మీ చేతనైన సాయం చెయ్యండిసార్. మీపేరు చెప్పుకు తింటాను' అన్నాడు నిరుద్యోగి.

ఆఫీసరు కంగారు పడ్డాడు. పడి అన్నాడు—

'అపనిచెయ్యకు. నాపేరు చెప్పుకు తినకు. అయినా నాకేం కాతాలు లేవనుకో..... ఉద్యోగం సంగతి చూద్దాం. సరేనువ్వికవెళ్ళు.'

ఆ ఆఫీసర్లతో యిదే చిక్కువని. చేసి పెట్టాలనుకున్నా 'చేస్తాం' అనిచెప్పరు. 'చూద్దాం' అంటారు. వాళ్ళ నిఘంటువులో 'చూద్దాం' అంటే 'చేస్తాం' అనే అర్థం. ఆ అర్థం తెలుసుకోపోతే చాలా కష్టం. నిరుద్యోగి ఏడుస్తూనే అన్నాడు.

'సరేసార్ ..... మీదయాధర్మం.తర్వాత నాఖర్మం. మీకు చాలా ఋణపడ్తాను.... వస్తాను' అని గుమ్మం దాటాడు. ఏడుపు ఆపేశాడు. స్టేషనుకు పోయాడు.

ఇంటికి వస్తూనే ఉద్యోగంవచ్చేసిందన్నాడు. 'ఉద్యోగంవస్తే నువ్వొచ్చేసేవెందుకోయ్, వెధవాయ్' అన్నాడు నిరుద్యోగి తండ్రి....... నిరుద్యోగి, నిరుద్యోగితండ్రి మాట్లాడేది యింటర్వ్యూకు వెళ్ళేప్పుడూ యింటర్వ్యూనుంచి వచ్చినప్పుడూను. ఈ లోగా చాలా అరుదుగానే మాట్లాడ్తారు. అప్పుడుకూడా నిరుద్యోగి బెదురుగానే మాట్లాడ్తాడు.

'యింకా ఆర్డర్లు పంపడమే తరువాయి' అన్నాడు నిరుద్యోగి మెల్లగా.

ఉద్యోగం వస్తుందన్న దగ్గర్నుంచి నిరుద్యోగి స్టేటస్ ఓమెట్టు పైకి పెరిగింది. మధ్యాహ్నం రొట్టెలూ అవీ చేసిపెడుతున్నారు. రొట్టెలతో నిరుద్యోగి బరువెక్కంగానే నిరుద్యోగి మాటలకి కూడా బరువిస్తున్నారు. నిరుద్యోగి బామ్మ ఆ బజారు, పక్క రెండు బజార్లు తిరిగి 'మా మనవడికి సర్కారుద్యోగం అయ్యింద'ని రోజుకు రెండు తడవలు చాటింపు వేస్తోంది. నిరుద్యోగి కాలకృత్యంలో కూడా కొంచెం మార్పులొచ్చాయి. పదింటికి ముందే లేచి పదింటికి ఆఫీసులకెళ్ళేవాళ్ళ కెదురుపడి ఉద్యోగం వచ్చేసిందంటున్నాడు. 'కంగ్రాచ్యులేషన్స్' అంటున్నారు స్నేహితులు. 'నీకష్టాలు తీరాయి' అని సంతోషం వెలిబుచ్చారు. కనిపించిన ప్రతివాడితోనూ చెప్పాడు. ఉద్యోగం వచ్చేసిందని. ప్రతివాడూ పైమాదిరే అన్నాడు. రోజూ పనికట్టుకొని, ప్రతివాడికోసం కనిపెట్టుకుని ఉద్యోగం వచ్చిందని చెప్తూనే వున్నాడు........ ఆర్డరు మాత్రం యింకా రాలేదు.

ఒకరోజు పొద్దున్నే లేచి ఎవడన్నా కనిపిస్తాడేమో ఉద్యోగం విషయం చెప్పుదామని వెతుకుతున్నాడు బజార్లో. దూరంగా వో స్నేహితుడు కనిపించాడు. వాడు నిరుద్యోగికి దూరపు స్నేహితుడు. దూరపు స్నేహితుడు దగ్గరయ్యాడు. నిరుద్యోగి నవ్వాడు. ఆగాడు. ఆపింది వడక, నవ్వు కాదు. నవ్వుతూనే వున్నాడు. స్నేహితుడూ నవ్వాడు. యిద్దరూ నవ్వుకున్నారు. 'ఓహో' అంటే 'ఓహో' అనుకున్నారు. 'యింకేవిటండీ' అంటే 'యింకేవున్నయ్యండీ' అనుకున్నారు. నిరుద్యోగికి ఉద్యోగం సంగతి చెప్పాలని మహోయిదిగావుంది. అవతలివాడు అడగటంలేదు. కనీసం 'యింకావేటికప్లై చేశార'ని కూడా అడగలేదు.దూరపు స్నేహితుడో మొహమాటస్తుడు. ఎప్పుడూ ఉద్యోగం గురించి అడిగితే నిరుద్యోగి ఏవను కుంటాడో నని ఎప్పుడూ అడగడు. ఎప్పుడో అడుగుతాడు. యిప్పుడడగలేదు... నిరుద్యోగికి చెప్పాలని చచ్చేంతయిదిగా వుంది. చివరికి నిరుద్యోగి అన్నాడు, 'అబ్బ! చలి బాగా వేస్తోందిగదండీ రెండుమూడ్రోజుల్నుంచి' అని.

'అబ్బే ఏం చలండీ .... అప్పుడే ఎక్కడ యింకా ముందుంది' అన్నాడు అవతలివాడు.

నిరుద్యోగి చల్లారిపోయాడు. ప్లాను పారలేదు. అవతలివాడు అవునంటే, 'చలేస్తోంది' అంటే పుంజుకుందామనుకున్నాడు.

'యిక్కడే యిట్లావుంటే హైదరాబాద్‌లో యింకా బాగా వుంటుందేమో? ఎట్లాగోమరి' అందామనుకున్నాడు. దాంతో అవతలివాడు 'హైదరాబాదు ఎందుకండీ' అంటాడు. అనాలి. అప్పుడు విషయం చెప్పొచ్చనుకున్నాడు. కానీ అట్లా జరగలేదు. మొదట్లోనే అడ్డం తిరిగింది. అవతలివాడు చలిలేదన్నాడు. నిజానికి నిజంకూడా అంతే— యింకా పైగా 'మీకేస్తోందేమో, మరి' అన్నాడు, మీ నిరుద్యోగులకి వేస్తుందిలే అనే ధ్వనిలో నిరుద్యోగి అభిమానం దెబ్బతింది. కొంచెం కోపంవచ్చింది. 'నన్నిట్లా అంటావా? నీకివాళ యీ వుద్యోగంసంగతి చెప్పకపోతేచూడు' అని ప్రతిజ్ఞ చేశాడు.... ఆలోచించాడు......

'పదింటికి ఆఫీసుకు తయారవ్వడం చాలా కష్టం సుమండీ! ... మరెట్లాగో నేనూ నేర్చుకోవాలి' అన్నాడు.

'అవునవును. అయినా చేరాక మీకే అలవాటవుతుంది లెండి,' అన్నాడు అవతలివాడు. యిప్పుడు చెప్పటానికి అవకాశం రాలేదు.

'మీరా, ఉద్యోగవా?...... ఎక్కడ' అంటాడనుకున్నాడు. 'యివ్వాళ నీకిది చెప్పిగానీ నిన్ను, ఆఫీసుక్కదల్నివ్వను' అని మళ్ళా ప్రమాణం చేశాడు. అవతలివాడు వెళ్ళేట్టు ముఖంపెట్టి 'రైట్, సార్' అని షేక్హ్యాండు యిచ్చాడు. నిరుద్యోగి అవకాశం వదులుకోదల్చుకోలేదు. అవతలివాడిచ్చిన చేతిని గట్టిగా పట్టుకున్నాడు. పట్టుకుని అన్నాడు.

'మీకు హైదరాబాదులో ఎవరన్నా స్నేహితు లున్నారాండీ' అని.

'ఏం, ఎందుకండోయ్' అన్నాడు అవతలివాడు.

'వెధవ! దొరొక్కాడు. దాకేం

టేస్తాడు' అనుకుని నవ్వుకున్నాడు నిరుద్యోగి. ఎక్కువగా నవ్వుతూ కూర్చుంటే చెప్పే అవకాశం పోతుందని విషయం చెప్పాడు. వాడు 'కంగ్రాచ్యులేషన్స్' అన్నాడు. 'థాంక్యూ' అన్నాడు నిరుద్యోగి.

'ఆఁ మరి పార్టీ మాకు' అన్నాడు అవతలి వాడు.

'ఓఁ తప్పకుండా' అన్నాడు నిరుద్యోగి. 'సరే, వస్తానండీ' అంటూ వెళ్ళిపోయాడు అవతలివాడు. వాడు హైద్రాబాద్‌లో స్నేహితులు వున్నారో లేదో చెప్పలేదు. నిరుద్యోగి మళ్ళీ అడగలేదు. వాడి అవసరం తీరింది. స్నేహితులున్నారో లేదో అనవసరం.

......అర్డరుమాత్రం యింకారాలేదు. కాని నిరుద్యోగిమాత్రం అందరివంకా చూస్తూ తలెత్తుకు తిరుగుతున్నాడు. లైబ్రరీలకు వెళ్ళడం తగ్గించాడు. వాంటెడ్ కాలమ్సుచూసే అవసరం తీరిందను కున్నాడు. బజార్లవెంట తిరుగుతున్నాడు, వివరన్నా కనుపిస్తారేమో, విషయం చెబుదామని.

వెలరోజులు గడిచాయ్. నిరుద్యోగి తండ్రి అనుమానించాడు. వోరోజున పొద్దున్నేలేచి 'అబ్బీ, వెధవ్వేషాలెయ్యక నిజం చెప్పు. నిజంగా నీ కిస్తానన్నాడా ఉద్యోగం' అన్నాడు.

'నాకేం అవసరం అబద్ధం చెప్పటానికి వూరికే కూర్చుని తినలేకనా' అన్నాడు. 'అయినా, హైద్రాబాదెళ్లి కనుక్కొస్తాను' అన్నాడు మళ్ళీ.

'కనుక్కొచ్చింది చాల్లే' అన్నాడు నిరుద్యోగి తండ్రి.

.....కొన్నాళ్లయ్యాక నిరుద్యోగికీ అనుమానం వేసింది. నిద్ర మానేశాడు. ఎవివి' దింటికే లేస్తున్నాడు. అన్నంమాత్రం మానేడు. యిప్పు డెవరన్నా అడిగితేనేతప్ప ఉద్యోగం వచ్చిందని చెప్పటల్లేదు.....

కొన్నాళ్లకో మిత్రుడు హైదరాబాదు నుంచి వచ్చాడు. 'ఫలానా పోస్టు విషయం నీకు తెలుసా' అనడిగాడు నిరుద్యోగి. 'తెలు స'న్నాడు మిత్రుడు. అది నెల్రకిందే ఫిల్లయిందన్నాడు. చేరినవాడు మిత్రుడి స్నేహితుడి చుట్టంవేట. 'ఎంత అన్యాయం అయిపోయాను. ఎట్లా జరిగింది' అన్నాడు నిరుద్యోగి.

మిత్రుడు మొదలెట్టాడు. 'మా ఫ్రెండు చుట్టం ఉన్నాడొకడు. నెల్రకితం వరకూ నీ మాదిరే నిరుద్యోగి, నువ్వెళ్లిన యింటర్వ్యూకే వెళ్లాడు. తర్వాత ఆఫీసరు దగ్గర కెళ్లి ముందు ఏడ్చేసి తర్వాత 'ఈ ఏడుపు విన్నందుకు మీకెంతో రుణపడ్డాను. మీ రుణం ఉంచుకోను. ఏదో నాకు దేవుడిచ్చిన దాంట్లో ఐదో పదో యిస్తాను ముందు. తర్వాత మీరిచ్చే దాంట్లో వెల నెలా సగం సగం వోవిడాది వరకూనో అర్నెల్ల వరకూనో తీసుకోండన్నాట్ట. ఆఫీసరు దాంతో వాణ్ణి మెచ్చేసుకుని 'నీకు బోల్డు లోకజ్ఞానం వుందని' వో సర్టిఫికేట్టు పారేసి, 'రేపు రా, అర్డరిస్తాను' అన్నాట్ట తర్వాతిచ్చాడు. వాడివ్వు డుద్యోగం చేస్తున్నాడు.

నిరుద్యోగి తన గోడంతా చెప్పుకున్నాడు. తనకు పరాభవం చేశాడని గోల పెట్టాడు.

'సరే. అయిందేదో అయింది. జరగాల్సింది చూడు......అయినా అవతల యిచ్చిన వాడికి నీకంటె ఎక్కువ బాధలున్నయ్యేమో. పోనీ బతుకుతాడని యిచ్చుంటాడు.' అని వోదార్చాడు మిత్రుడు.

'అదేం కాదోయ్.....నన్ను పరాభవించటానికే వాడికిచ్చాడుద్యోగం. వాడికేం బాధల్లేవు.....అయినా దుర్యోధనుడు ద్రౌపది చీరెలెందుకు లాగించాడు. అతగాడికి చీరెలు తక్కువయ్యా. పరాభవం చేస్తాననికదూ' అని వాపోయాడు నిరుద్యోగి. 'దుర్యోధనుడు లాక్కున్న చీరలు ద్రౌపదివేకదా? కానీ యీ ఉద్యోగం నీదికాదు కదా' అని వోదార్చి వెళ్లిపోయాడు మిత్రుడు.

నిరుద్యోగికి ఏడుపొచ్చింది. తన తెలివి తక్కువ తెలిసొచ్చింది. లేకపోతే తను ఋణపడ్తాననే అన్నాడుకానీ ఋణం వుంచుకోనన్నాడా?......తను ఏడిస్తేనే పనైపోతుం దనుకున్నాడు......వట్టి ఏడుపు లాభంలేదన్న మాట.' అని ఆలోచించాడు. దప్పున చిరునవ్వు చిందిస్తూ, చిరుద్యోగి గుర్తుకొచ్చాడు. వాడి తాలూకుమాటలూ విన్పించాయ్. 'ఏడుపు నూటికి తొంభై కేసుల్లో సక్సెస్.' అది మర్చిపోయాడు నిరుద్యోగి. 'సెంట్ పర్సెంట్ పక్సెస్సిచ్చేది ముడుపు... అప్పుడు తన దగ్గరదిలేదు. దానిక్కారణం యింటి దగ్గర వాళ్ళు. .... యింటి కెళ్లాడు నిరుద్యోగి కోపంగా. వెళ్తూనే 'మీ మూలంగానే నావుద్యోగం పోయిందంటూ' గోలపెట్టాడు. నిరుద్యోగి తండ్రి ఆశ్చర్య పడ్డాడు. 'యిదేవిటోయ్, చదువు డబ్బిచ్చి, ఉద్యోగాలకీ డబ్బిస్తే యింకా యీ చదువుల వుపయోగం ఏవిటి?' అన్నాడు.

నిరుద్యోగి గోలమానేడు. భోరుమన్నాడు. 'హారుగాల్లో పడవ మాదిరయ్యింది నా బతుక'న్నాడు.

యీగోలంతా ఏవిటి అంటూ చుట్టుపక్కల వాళ్లంతా వచ్చారు. ముసలాయనకి కోపం వచ్చింది. 'మీరేవన్నా ఆర్చేవాళ్లా? తీర్చేవాళ్లా? కొంపలార్పే వాళ్లు గాని' అని 'ఫొండ'న్నాడు. వాళ్లల్లోంచొకడు బయట కొచ్చాడు, 'ఆర్చేదీ నేనే, తీర్చేదీ నేనే' నన్నాడు. 'విషయం ఏవిట'న్నాడు. విషయం విన్నాడు. 'హుఁ' అన్నాడు. 'అదా, అట్లా జరిగిందన్నమాట' అన్నాడు. 'అవును, అట్లాగే జరుగుతుంది' అన్నాడు మళ్ళీ. చివరికి కనుబొమలు పైకెత్తి చెప్పాడు

'దీనికంతకీ కారణం మీరు విఘ్నరాజాని కొలవకపోవటం. భగ్న జీవుల పాలిట కల్పవృక్షం అతడు. అలాంటి వాణ్ణి మీ రాశ్రయించలేదు.'

'ప్రతిరోజూ వినాయక పూజ చేస్తూనే వుంటా వండీ' అన్నాడు ముసలాయన. ఆర్చేవాడు ఆశ్చర్య పడ్డాడు.

'మీకింకా యీ కొత్త పోస్టింగ్సు



# నిరుద్యోగపర్వం

తెలియవన్న మాట. అంతే మరి. ఎలా తెలుస్తాయ్. మీరు పేపరు రెండోపేజీ తప్ప చూడరు. .... కొన్నాళ్ల క్రితం హోగమ్మత్తు జరిగింది. వినండి చెపుతాను.'

'....ఒకరోజు పొద్దున్నే దేశంలోని కార్లూ, జీపులూ, రైళ్లూ, బళ్లూ.... అన్నీ నాలుగు వేపుల్నుంచి బయల్దేరి హోమూలకొచ్చాయ్. వాటిల్లోంచి నాయకులు దిగారు. వాళ్లంతా హోఅత్యవసర సమావేశాని కొచ్చారు. ప్రతి నాయకుడి చేతిలోనూ హో పత్రికుంది. అదారోజుది కాదు. అంతక్రితంలో వారం రోజుల నాటిది. ప్రతివాడు కోప్పడిపోతున్నాడు. యింతకూ జరిగిన విషయం ఏమిటంటే హో చదువుకున్నవాడు. ఉన్నవా ఊరుకోక కాని పనోటి చేశాట్ట. హో కథ రాశాట్ట. ఆ కథలో ఎక్కడో 'పొలిటిక్స్ యీజ్ ది లాస్ట్ రిసార్ట్ ఫర్ ఎ స్కౌండ్రల్' అన్నాట్ట. దాంతో నాయకులందరూ కోపగించుకున్నారు.

'ఏం మన్లోమాత్రం మంచివాళ్లు లేరా? దేశసేవ చేస్తుంటే మనకొచ్చే మాట యిదా. ఈ చదువుకున్నవాళ్లకి తామే సంతకాలు చెయ్యగలమని పొగరెక్కింది. వీ డెందుకిలా రాశాడు' అని కోప్పడ్డారు. యిలా ఆలోచించి చివరి కో నిర్ణయానికొచ్చారు. 'ఈ చదువుకున్నవాళ్లకి నాయకులమీద భక్తి, శ్రద్ధల్లేవు' అని. అందుకని వాళ్ల శక్తి నిరూపిస్తానికో యుక్తిపన్నారు. వీళ్ల ఆసరా లేకుండా చదువుకున్నవాళ్ల కుద్యోగాలు రాకూడదన్నారు....అందుకని వినాయకుడి దగ్గర్నుంచి ఉద్యోగా లిప్పించే పని తమ కిప్పించమని బ్రహ్మదేవుడికో ఉత్తరం రాశారు. కొందరు బెదిరింపులిచ్చారు. అలా చెయ్యకపోతే హో యాక్టు పాస్జేసి దేవుళ్లకు పూజా పునస్కారాలు చేసీకుండా చేస్తానని బెదిరించారు. 'నాకేంపోయింది. నేను వాటి కెలాగూ నోచుకోలేదు' అన్నాడు బ్రహ్మ. కానీ శివ విష్ణువులు భయపడ్డారు.

'బాబూ, మా కింకా ఏవో అక్కడగు (గూ) ళ్లున్నయ్. మానో (గూ) ట్లో ఎందుకు దుమ్ముకొడతావ్. అందుకని వాళ్లు చెప్పినట్లు చెయ్. లేకపోతే వాళ్లన్నంత పనీ చేస్తారు. వాళ్లసలే కలియుగ దేవతలు. మన విగ్రహాలున్నా లేకపోయినా వాళ్ల ఫోటోయింటి కొకటుంటుంది. అని సలహా యిచ్చారు శివ విష్ణువులు. బ్రహ్మకి వప్పుకోక తప్పింది కాదు. అదీగాక తనొప్పుకోకపోయినా కొడుకుతోచెప్పి చేయించుకుంటాడు శివుడు. మధ్యలో మన మాటెందుకు పోవాలని 'సరే' నన్నాడు బ్రహ్మ. అవాల్టినుంచీ ఉద్యోగా లిప్పించే భా (వ) రం వినాయకుడి దగ్గర్నుంచి నాయకుల కొచ్చింది.'

'ఈ సంగతి మా కింకా తెలియదుసుమా! అవురా! వినాయకుడి క్కూడా టోకరా యిచ్చాశారే నాయకులు' అని హాశ్చర్య పడ్డాడు నిరుద్యోగి తండ్రి.

'మీ కింకా తెలియకపోవడం హాశ్చర్యంగా ఉంది. వాళ్లు సభల్లో చెబుతూనే వున్నారుగా. నిరుద్యోగ నిర్మూలనమే మా బాధ్యత. వినాయకుడిదికాదు. దానికి కంకణం కట్టుకుంటాం' అని అన్నాడు ఆర్పేవాడు. నిరుద్యోగిని దగ్గిరకు పిల్చాడు. బుజ్జగించాడు.

'కాబట్టి ఓ నిరుద్యోగీ! నువ్వు ఉద్యోగం రావాలని ప్రార్థించేటప్పుడు వినాయకుడు చెవులు మూసుక్కూర్చుంటాడు. కాబట్టి నువ్వో నాయకుడి ఫోటో యింట్లో పెట్టుకుని నాయకుణ్ణి పరోక్షంగా పూజిస్తూ ప్రత్యక్షంగా సేవిస్తూ ఉండాలి. దగ్గర్లో ఎలక్షన్లొస్తున్నాయి. యిప్పటినుంచే పార్టీ కొట్టనివాణ్ణి, గట్టివాణ్ణిచూసి హో నాయకుడివెంట తిరుగు. ఎన్నికల్లో ప్రచారం చెయ్యి. ఉద్యోగసిద్ధిరస్తు' అని దీవించి, నిరుద్యోగి ఏడుపు మాన్పించి వెళ్లిపోయాడు ఆర్పేవాడు.

'యింకేహోయ్. పూరిడే తిని తిరక్కపోతే ఆ ఎలక్షన్లలో తిరగరాగూ' అన్నాడు నిరుద్యోగి తండ్రి.

'నాకు రాజకీయా లిష్టం లేద'న్నాడు నిరుద్యోగి.



అట్లా అనే మీ వాడెవడో యీ పిడ తెచ్చాడు. నోరు మూసుకుని హో నాయకుణ్ణాశ్రయించు' అని కండువా భుజానేసుకుని బయటికిపోయాడు నిరుద్యోగి తండ్రి. నిరుద్యోగి నిద్దరపోయాడు.

(ఇంకా ఉంది)

# చేతికి నాలుగువేళ్ళే ఉంటే?

డాక్టర్ మహీధర్ నళినీమోహన్

మనుష్యుల చేతులకు ఒక్కొక్క దానికి ఐదేసి వేళ్ళకి బదులుగా నాలుగేసి వేళ్ళుమాత్రమే ఉంటే ఏమవుతుంది? నేను వ్రాయదలుచుకున్నది శరీరశాస్త్రం మీద వ్యాసం కాదు. గణితశాస్త్రంమీద. గణితానికి చేతివేళ్ళకీ సంబంధం ఏమిటంటారా? అబ్బో! బోలెడంత సంబంధం ఉంది. అదే ఇక్కడ చెప్పబోయేది.

లెక్కలలో మనం 0, 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 అనే పది అంకెలను ఉపయోగిస్తున్నాం. ఎంత పెద్ద సంఖ్యను వ్రాయాలన్నా ఈ పది సంఖ్యలూ చాలు. అసలు పది అంకెలు ఎందుకు కావలసి వచ్చాయి? 12 గుర్తులు ఎందుకు ఉపయోగించ కూడదు? నిజానికి రోమనుల కాలంలో పదికి కాక పన్నెండుకి అధిక ప్రాధాన్యత నిచ్చేవారు. అప్పటి అవశేషాలేకొన్ని ఈ నాటికీ మిగిలిఉన్నాయి. అడుగుకి 12 అంగుళాలు, షిల్లింగుకి 12 పెన్నీలు, గడియారం మీద 12 అంకెలు, సంవత్సరానికి 12 నెలలు... మొదలైనవి వీటిలో కొన్ని. కొంతకాలా 12కి బదులు పది అంకెలు మాత్రమే వాడడం సర్వే సర్వత్రా అమలులోకి వచ్చేసింది. ఇల్లా ఎందుకు జరిగింది? దీని వల్ల ఉపయోగం ఏమిటి?

"మూడువేల రెండువందల ముప్పై నాలుగు" అనే సంఖ్యను అంకెలలో వ్రాయమంటే ఒకటో తరగతి పిల్లవాడు కూడా 3234 అని తడుముకోకుండా రాసేస్తాడు. అదే రోమనుల కాలంలో అయితే MMMCCXXXIV అని వ్రాసేవారు! 3234 ని 12 పెట్టి గుణిస్తే 38808 వస్తుంది అని ఒక్కనిమిషంలో జవాబు ఇస్తారు ఈనాటి బడి పిల్లలు. అదే రోమనుల కాలంలో అయితే ఈ లెక్క చేయడానికి విశ్వవిద్యాలయం కడంటా చదివిన వారికే గంటపైగా పట్టేది! రోమను అంకెలతో లెక్కలు చేయడం ఎంత కష్టమో ప్రయత్నించి చూడండి మీకే తెలుస్తుంది. మనం ఇప్పుడు సంఖ్యలను వ్రాస్తున్న పద్ధతి (దశాంశ పద్ధతి) మనిషి తన అపార మేధశ్శక్తిని వెచ్చించి కనిపెట్టిన మహత్తర విజ్ఞానఖని. అసలి చేసిన మహామహుడెవడో తెలియదు కానీ, అతడికి మానవ జాతి యావత్తూ ఋణపడి ఉంది. ఈ అంకెల పద్ధతి తెలియకపోతే మనమింకా రెండు వేల ఏళ్ళు వెనకబడి ఉండేవాళ్ళం. మనం వాడే ఈ అంకెల పద్ధతిని మన హిందూ గణితశాస్త్రజ్ఞులు కనిపెట్టేరు. మనవాళ్ళు గర్వంగా చెప్పుకోదగ్గ విషయాలలో ఇదొకటి. మనదేశం నుంచి అరబ్బులకూ, అక్కడినుంచి యూరప్‌కీ పాకింది ఈ పద్ధతి.

ఈ పద్ధతిలో ముఖ్యమైనది ఏమిటంటే స్థానములను బట్టి అంకెలకు విలువలు మారడం. 5234 అనే సంఖ్యలో 5 విలువ వట్టి 5 కాదు. ఐదువేలు. అది ఎడమనుంచి నాలుగవ స్థానంలో ఉంది కనుక దానికా ప్రత్యేకమైన విలువ. 2 విలువ వట్టి రెండుకాదు. రెండువందలు. దానికి కారణం ఎడమనుంచి మూడవ స్థానంలో ఉండడమే. అల్లాగే 3 విలువ మూడు పదులు. 4 విలువ వట్టి నాలుగు మాత్రమే. "స్థాన బలిమి కాని తనబల్మి కాదయా" అన్న వాక్యం ఇక్కడ అక్షరాలా నిజం. పై సంఖ్యనే ఈ క్రింది విధంగా విడదీసి వ్రాయవచ్చు.

$$5234 = 5 \times 1000 + 2 \times 100 + 3 \times 10 + 4$$

లేదా $$5234 = 5 \times 10^3 + 2 \times 10^2 + 3 \times 10^1 + 4 \times 10^0$$

అని వ్రాస్తారు బీజగణితం తెలిసినవారు. ఎడమ నుంచి కుడికి వెళ్ళినకొద్దీ స్థానముల విలువ పదేసి రెట్లు పెరుగుతుంది. ఈ సంఖ్యా పద్ధతికి "పది" మూలస్తంభం. కనుకనే దీనిని దశాంశ పద్ధతి అన్నారు. ఈ దశాంశ పద్ధతి అమలులోకి రావడానికి మనుష్యుల చేతులకి మొత్తం పదివేళ్ళు ఉండడమే కారణం అనివూహిస్తున్నారు! బహు పురాతన కాలంలో గొర్రెలనో, కొబ్బరి కాయలనో మరోవస్తువులనో లెక్కపెట్టడానికి గులకరాళ్లను గాని, చేతివేళ్ళను గాని ఉపయోగించేవారు. పదివేళ్ళూ లెక్కపెట్టడం అయాక పదికి గుర్తుగా ఒకవేలును మడిచి ఉంచడం మామూలే ఈనాటికీ. ముడిచినవేలు పదికి గుర్తు. లాటిన్ భాషలో "కాల్క్యులస్" (Calculus) అంటే గులకరాయి అని అర్థం. దానినుంచే Calculation (లెక్కచేయుట) అనేమాట వచ్చింది.

ఒకరైతు దగ్గర కొన్నివేల కొబ్బరి కాయలున్నాయనుకుందాం. వాటిని లెక్కపెట్టడానికీ, గుర్తుగా ఉంచుకోడానికి సరిగ్గా ఇన్ని గులకరాళ్ళు అవసరమయేవి పూర్వకాలంలో. దరిమిలాని తెలివైన వాళ్ళు పదేసి గులకరాళ్ళ పోగులుపెట్టి ఒక్కొక్కపోగుకి × అనే ప్రత్యేకపు గుర్తు పెట్టుకున్నారు. అటువంటి పోగులుపదిఉంటే C అనేగుర్తు పెట్టుకున్నారు. అటువంటివి పదివుంటే M అనే గుర్తు పెట్టుకున్నారు. ఈవిధంగా రోమను అంకెలు ఏర్పడ్డాయి. వేరు వేరు పోగులకు వేరువేరు గుర్తులు అవసరం లేదనీ, స్థానభేదం చేత వేరువేరుఅర్థాలు కల్పించవచ్చుననీ హిందూ గణితశాస్త్రజ్ఞులు పైమెట్టుకి వెళ్లేరు. ఏదైనా స్థానంలో ఒక్కపోగుకూడా లేకపోతే అక్కడ శూన్యత్వాన్ని సూచించడానికి "0" అనే గుర్తును వాడుక చేశారు. శూన్య అనేది ప్రపంచానికి మన భారతీయ విజ్ఞానులు పెట్టిన మరొకభిక్ష.

కొబ్బరికాయలు తొమ్మిది అయేవరకూ 1, 2, 3, ..... 9 అని గులకరాళ్ళు పోగులా పెట్టుకుంటూ వచ్చి, పది అవగానే ఆపదిరాళ్ళ పోగును తీసేసి దానికి ఎడమన ఉన్నస్థానంలో ఒక్కరాయి పెట్టేవారు. పోగును తీసివేయడం చేత ఆ స్థానంలో సున్న మిగిలింది. ఈవిధంగా పది అనే సంఖ్యకు 10 అనేది గుర్తుగా ఏర్పడింది. అల్లాగే మిగిలినస్థానాలూనూ.

మనిషి రెండుచేతులకీ కలిపిమొత్తం పదివేళ్ళు కాక ఎనిమిది వేళ్ళుమాత్రమే ఉండి ఉన్నట్లైతే మనకు ఇప్పటిదశాంశ పద్ధతిపోయి "అష్టాంశ పద్ధతి" అమలులోకి వచ్చిఉండేదేమో! ఈపద్ధతిలో 0, 1, 2, 3, 4, 5, 6, 7, అనే ఎనిమిది అంకెలనే వాడుక చేస్తారు. ఎనిమిదికి ప్రత్యేక సంజ్ఞ అవసరం లేదు.

ఎనిమిది రాగానే 10 అని వ్రాస్తారు.

ఈ అష్టాంశ పద్ధతిలో కూడా ఎడమ నుంచి కుడికి వెడితే స్థానముల విలువలు పెరుగుతాయి కాని ఆ పెరగడం పదేసి రెట్లు కాదు. ఎనిమిదేసి రెట్లు ఇందులో స్థానాల విలువలు ఒకట్లు, ఎనిమిదులు అరవై నాలుగులు ($8\times8=64=8^2$) అయిదు వందల పన్నెండులు ($8\times8\times8=512=8^3$) అని ఉంటాయి ఈ అష్టాంశ పద్ధతిలో 5234 అని వ్రాస్తే దాని అర్థం $5\times8^3+2\times8^2+3\times8^1+4\times8^0$ అవుతుంది. దాని విలువ మనకు తెలిసిన దశాంశ పద్ధతిలో 2716 కి సమానం అవుతుంది. ($2560+128+24+4$)

మనం దశాంశ పద్ధతిని వాడుకోవడం కాకతాళీయంగా జరిగిందే కాని పది అనే సంఖ్యకు మనం వూహించుకునే ప్రత్యేక

## చేతికి నాలుగు వేళ్ళే ఉంటే?

లక్షణాలు ఏవీ లేవు ఇంతకన్న ద్వాదశాంశ పద్ధతిగాని, అష్టాంశ పద్ధతిగాని ఉపయోగించి ఉంటే ఎక్కువ లాభించేది.

ఎలక్ట్రానిక్ కంప్యూటర్లలో బైనరీ పద్ధతి వాడుక చేస్తున్నారు ఇందులో 0, 1 అనేవి రెండే రెండు అంకెలు ఇందులో ఎడమ నుంచి కుడికివెడితే స్థానాల విలువలు రెండేసిరెట్లు పెరుగుతాయి. ఇందులో స్థానాల విలువలు ఒకట్లు ($2^0$), రెళ్ళు ($2^1$), నాలుగులు ($2^2$), ఎనిమిదులు ($2^3$), పదహార్లు ($2^4$), .... ఇల్లా ఉంటాయి.

కంప్యూటర్లకి అయితే ఈ బైనరీ పద్ధతి బాగా నప్పింది గాని, అదే మనం మామూలుగా చేసుకునే లెక్కలలో దీనిని వాడితే తెగబారెడు పొడుగు అంకెలు వాడవలసి వస్తుంది కనుక ఇది మనం వాడుకోడానికి ఇబ్బందులున్నాయి.

దశాంశ పద్ధతిలో నుంచి మరో పద్ధతిలోకి సంఖ్యలను మార్చడం ఎల్లాగ? ఇది చాలా సులభం.

234 అనే దశాంశ సంఖ్యను బైనరీ సంఖ్యగా మార్చాలనుకుందాం. అప్పుడు దీనిని రెండు పెట్టి భాగించాలి. శేషం వేరే ఒకచోట వేసుకోవాలి. వచ్చిన విభక్తాన్ని మళ్ళీ రెండుచే భాగించి, శేషం వేరుగా ఉంచాలి. వచ్చిన విభక్తాన్ని మళ్ళీ రెండుచే భాగించి, శేషం వేరుగా ఉంచాలి. వచ్చిన విభక్తాన్ని మళ్ళీ రెండుచే భాగించి దానిని మళ్ళీ, దానిని మళ్ళీ.... ఈవిధంగా విభక్తం సున్న వచ్చేవరకూ చెయ్యాలి వచ్చిన శేషాలనన్నింటినీ వరుసగా ఎడమనుంచి కుడికివేస్తే కావలసిన బైనరీ సంఖ్యవస్తుంది.

| | | |
|---|---|---|
| 2\|234 | | శేషం |
| 2\|117 | .... | 0 |
| 2\|58 | ...... | 1 |
| 2\|29 | ..... | 0 |
| 2\|14 | ...... | 1 |
| 2\|7 | ...... | 0 |
| 2\|3 | ..... | 1 |
| 2\|1 | ...... | 1 |
| 1 | ...... | 1 |

ఈ శేషములను ఎడమ నుంచి కుడికి వ్రాస్తే 11101010 వస్తుంది ఇదే బైనరీ భాషలో 234

అష్టాంశ పద్ధతిలో వ్రాయాలన్నా ఇలాగే చెయ్యాలి.

| | | |
|---|---|---|
| 8\|234 | | శేషం |
| 8\|29 | ...... | 2 |
| 8\|3 | ...... | 5 |
| 0 | ...... | 3 |

ఈ శేషములను ఎడమనుంచి కుడికి వ్రాస్తే 352 వస్తుంది ఇది అష్టాంశ పద్ధతిలో రెండువందల ముప్ఫై నాలుగుకి సమానం.

బైనరీ, దశాంశ పద్ధతులు మినహాగా మిగిలిన పద్ధతులేవీ వాడుకలో లేవు, రహస్య సంకేతాలు పంపించదలచేవారికి తప్ప. ●



# త్వరలో ఆమె లెక్కించదగిన ఆదాయమును కలిగియుండును!

ఇప్పుడు మీ బిడ్డను ఆదాచేయనారంభించనీయండి. ఆమెకొరకు స్టేట్ బ్యాంకులో ఒక సేవింగ్స్ బ్యాంకు అక్కౌంటును ప్రారంభించండి. ఆమె ఆదాయము పెరుగుచుండజూచుట ఆమెకు ప్రీతి.
వెక్కువల్ల వడవబడే మైనర్స్ సేవింగ్స్ బ్యాంక్ అక్కౌంట్లను ప్రారంభించవచ్చును:

(ఎ) మైనరుకు యుక్త వయస్సు వచ్చేవరకూ అక్కౌంటును నడిపే సహజమైన లేక కోర్టువల్ల నియమించ బడిన సంరక్షకుడు ప్రారంభించవచ్చును. యుక్తవయస్సు రాగానే ఆ మైనరే తన అక్కౌంటును నడుపుకో నారంభించును.

(బి) తామే డిపోజిట్లను వుంచి, సొమ్మును తిరిగి తీసుకొనుచుండగల 14 సంవత్సరములు లేక అంతకు మించిన వయస్సుగల పిల్లలు ప్రారంభించవచ్చును.

## స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం

LPE Aiyars. S. 142 Tel




జయప్రద నవ్వింది.

మళ్ళీ అదే నవ్వు.— మహాప్రవాహం ఆనకట్ట మీదుగా క్రిందికి దూకినట్లు, పందెం వేయబోయేముందు పావులు గలగల లాడించినట్లు.

సారథి ఆశ్చర్యపడనూలేదు. ఆమె ఏం చెప్తుందా అనే ఉత్సుకతను ప్రదర్శించనూ లేదు. జయప్రదకు, కళ్యాణికీ గల వ్యత్యాసాన్ని మాత్రం అతని మనస్సు కొలవసాగింది.

కళ్యాణి కూడా నవ్వేది, చాలా అందంగా, హాయిగా నవ్వేది. ఆమె నవ్వు వెన్నెల కురిసినట్లు బోలెడు మల్లెలు విరిసినట్లు వుండేది.

"మహామేధావికీ, పక్కా పిచ్చివాడికీ మెదడులో అతిసున్నితమైన పొర మాత్రమే అడ్డు అని ఎక్కడో చదివేను. మిమ్మల్ని చూస్తుంటే అది నిజమనే అనిపిస్తోంది. మీరు విశాఖపట్టణం వెళ్ళేదారిలో ప్రయాణం చేస్తున్నారేమోననే అనుమానమూ కలుగుతోంది." జయప్రద మాటల్లో గడసరితనం తొణికింది.

సారథి ఈసారి ఆమె కళ్ళల్లోకి చూసేడు.

"నిజం!" అన్నట్లు వేయి మెరుపులు నింపుకున్న కళ్ళను చికిలించి, ఠీవిగా చేతులు కట్టుకు నిలబడింది జయప్రద.

కళ్యాణి కూడా చిత్రంగా, సరదాగా, మాట్లాడుతూ వుండేది. కాని అణకువ, ఆదరణ నింపుకుని వుండేవామె మాటలు.

జయప్రద అలాగే నిలబడి వుంది. జూకా మల్లెలోని సౌకుమార్యాన్ని, సౌదామినిలోని హొయలునూ ప్రదర్శించుతూ.

కళ్యాణి కూడా ఇంతకింత అందంగా వుండేది. 'సొవు' మొక్కలోని సొగసును, స్ఫటికంలోని స్వచ్ఛతనూ తన స్వంతం చేసుకుని.

జయప్రద రూపలావణ్యానికి ముగ్ధుడైన సారథి ఆమెను కన్నార్పకుండా చూడసాగేడు. నిశ్శబ్దంలో కలుస్తున్న క్షణాలు ఆమె శరీరపు వంపుసొంపుల్ని అతని మనో ఫలకం మీద ముద్రించటానికి వినియోగ పడినై.

"మీమీదుండే సద్భావం కొద్దీ నేనిప్పుడే నిరుత్సాహపడి భోరున ఏడవదలచుకోలేదు. మరోసారి తీరిగ్గా ఆలోచించుకుని మీ విశాఖపట్టణం ప్రయాణం మానుకోండి. మీ నిర్ణయం నాకనుకూలంగా ఉంటుందనే ఆశతో కొన్నిరోజులు గడుపుతాను. వస్తా."

ఆమె వెళ్ళిపోయింది— వాయుగుండం ప్రభావానికి ఉద్భవించిన పెనుగాలిలా, ఆకర్ణాంతంలాగి విడిచిన బాణంలా..

గంటలతరబడి తనవద్ద కూర్చుని కళ్యాణి వెళ్ళిపోతూ వుండేది రాత్రిళ్ళు ఏ పన్నెండింటికో—ఆకాశంలోనుంచి ఓచుక్క డ్రుల్లినట్లు, హిమాలయాల్లో మంచుకురిసినట్లు.

జయప్రద అన్న 'విశాఖపట్టణ ప్రయా

జం' మాట గుర్తుకొచ్చి నవ్వొచ్చింది సారథికి. 'పిచ్చి'కి ఎంత చక్కటిమాట— చేదుమాత్రకు పంచదార పైపూతలా! అంత లోనే "నేను నిజంగా ఆ ప్రయాణంలో వున్నానా?" అనే సందేహం—కాదు—భయం ఆవహించింది. ఎదురుగా గోడకు వ్రేలాడుతున్న పిచ్చివాడి చిత్రం తనను చూసి వెక్కిరించినట్లైంది. ఎన్నడో చిన్నతనంలో చిత్రకళను ప్రారంభించిన క్రొత్తలో తాను వేసిన చిత్రమే అది! అసలుజయప్రదతో తానెందుకా మాటల్ని అన్నానా అనే గత జలసేతుబంధనంలో నిమగ్నుడయ్యాడు. చూపుమరల్చితే దృష్టి 'ప్రణయిని' చిత్రంపైన నిల్చింది. 'రాధ'లో కల్యాణి కనిపించింది. ఆచిత్రం గీయటానికి సరిగ్గా నెలరోజులు పట్టింది. ఆనెలరోజుల కల్యాణి సహకారం, ఆమెహోర్పు అన్నీ గుర్తుకొచ్చేయి. రోజూ రాత్రి ఏనిమిదింటికి వచ్చి రెండుమూడుగంటలు తన చిత్రకళాభ్యాసానికి సాధనమయ్యేది. సాధన యేమిటి తన చిత్రాలకు ప్రాణం, ప్రణయం కల్యాణి! ఆరోజుల్లో తానునుభవించిన వేదన గుర్తుకొస్తే ఈనాటికీ తను కృంగి పోతాడు. ఏదో సాధించాలనే ఆరాటం, దాన్ని పొందలేని అసహాయత— అందంకోసం అహోరాత్రులు అన్వేషణ దృగ్గోచరమైన సమస్త సౌందర్యాన్నీ చిత్రాల్లో ప్రతిబింబింపచేయాలనే ఆకాంక్ష—ఇవే తనుగా బ్రతికినరోజులు. ఆరోజుల్ని అప్పట్లో ఓ అమూర్త చిత్రంగా చిత్రించాడు కూడా. అదే 'గడ్డురోజులు' చిత్రం!

ఆ గడ్డురోజుల్లోనే కల్యాణిని పరిచయం చేశాడు రాజా.

రాజుతనకు ఆప్తమిత్రుడు. ప్రాణానికి ప్రాణంగా భావించుకునేది రాజా మురళితో తనకున్న స్నేహం. మురళి కలకత్తా వెళ్ళిపోయాడు. ఉద్యోగంమీద. కల్యాణి రాజా మరదలు. అతనికోసం జన్మించిన భార్య!

తొలిసారిగా కల్యాణినిచూసి "అందానికి నిర్వచనం కల్యాణి" అనుకున్నాడు తను. పూరేకుల్లోనూ తుషార బిందువుల్లోనూ కనిపించే ఆమె తరుణత్వానికి ముగ్ధుడై అవ్యక్తమధురానుభూతితో ఆనందాన్ని పొందేడు. ఆ ఆనందాన్ని తనచిత్రాల్లో బహిర్గతం చేసుకుని ఆత్మసంతృప్తిని పొందేడు.

కల్యాణి స్నేహంతో ఆమెసహకారంతో తనకళ, కళ ఫలించేయి. సంకుచితత్వానికి ఈర్ష్యాసూయలకూ చోటివ్వని రాజా హృదయం తన తపోసాధనకు పరోక్షంగా దోహదం చేసింది.

డాక్టరేట్ సంపాదించుకున్న రాజాతో కల్యాణి కూడా కలకత్తాకి వెళ్ళిపోయింది. ఆరోజు............

రాజా కల్యాణి తనవద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయేరోజున......

తానెంతో నిరుత్సాహ పడిపోయి కల్యాణికి తనమనస్సులోని మాటను తెలియజేసేడు. "నేనివాళ చిత్రకారుడిగా పదిమందిచేత ఔననిపించుకుంటున్నానంటే ఆఘనతంతా నీదే కల్యాణి! నా చిత్రకళకు జీవం నీవేగదా! నువ్వువెళ్ళిపోతున్నావు.నాబతుకు మళ్ళీ మునుపటిలా చీకటై పోతుందేమోననే భయం, మానసికంగా నాకు శాంతి, విశ్రాంతి వుండవేమోననే దిగులూ. కలుగుతున్నాయి."

కల్యాణి చిరునవ్వొలికిస్తూ అంది "ఓ చక్కని చుక్కని చూసి పెళ్ళిచేసుకోండి. అన్నివిధాలా మీకు సుఖం, సంతోషం లభిస్తై."

కల్యాణిమాటకు మ్లానంగా నవ్వటం కన్నా తానేమీ చెప్పలేక పోయాడు. కాని తన ఆంతర్యాన్ని గెలుచుకున్న రాజామాత్రం "సారథి నిజమైన కళాకారుడు. అతని పని సౌందర్యాన్ని అందాన్ని అన్వేషించటం వరకే. దాన్ని అనుభవించటానికి జంకుతాడు."అన్నాడు.

"ఔను. కల్యాణి వెళ్ళిపోతుంది. నా అన్వేషణ మళ్ళీ ప్రారంభమౌతుంది" అని గొణుక్కున్నాడు తాను. ఇంతలో ఎవరో స్నేహితులు రావడంతో సంభాషణ మారిపోయింది.

కల్యాణి వెళ్ళిన తర్వాత గోవిందసంఘటనతో పరిచయమైంది జయప్రద.

ఆవేళ తాను సిటీ బస్సులో వెళ్తున్నాడు. ఫ్రంట్‌సీట్‌లో కూర్చున్న ఒకాయన వూళ్ళో జరుగుతున్న చిత్రకళా ప్రదర్శనాన్నిగురించి తన అభిప్రాయాలు చెప్పుకు పోతున్నాడు. సహజంగా, చిత్రకళలో ఉత్సాహం కల వాళ్ళందరూ తలోక వ్యాఖ్యచేస్తున్నారు. విషయం తనకు సంబంధించినది కావడంతో ఉత్సుకతతో తనూ అక్కడకు వెళ్ళినిలుచున్నాడు. ఆవక్త బాగా పెద్దమనిషి. ఏభై, అరవై ఏళ్ళుంటై. ప్రదర్శనను గురించి మెచ్చికోలుగానే మాట్లాడుతున్నాడు. ఉన్నట్టుండి ఆయన ప్రక్క సీట్లో కూర్చున్న యువతి [illegible] పిల్చింది. "ఆ ఏం ప్రదర్శనల్లెండి. ఆర్టు పేపరు మీద వో బుట్టెడు సిరా పారబోయడం— బ్రహ్మాండమైన కళాఖండమని చప్పట్లు కొట్టుకోవడం" తను— తనేమిటి అందరూ ఆమెవైపు ఆశ్చర్యంతో తేరిపార చూశారు. తను మాత్రం ఆయువతి అవయవ సౌష్టవానికి, దేహచ్ఛాయకు సౌందర్యానికి విభ్రాంతుడైనాడు. క్షణాల తర్వాత ఆ పెద్దమనిషే చెప్పాడు. "అలాంటి ఆధునిక చిత్రాలు కావమ్మా యువి భారతీయతను పుణికి పుచ్చుకుని జీవకళ పుట్టిపడే వర్ణచిత్రాలు. ఆర్టిస్టెవరో తెలుసా? —'సా'."

గొల్లున బస్సులో వారంతా నవ్వేరు. తను సిగ్గుతో కుచించుకు పోయినా, కించిత్తు గర్వం లాంటిది కలిగింది - తన చిత్రాల్ని గురించి నలుగురి విమర్శ వినేసరికి!

నవ్వు నాపుకుంటూ "అయితే ఆ బ్రహ్మాండమేమిటో చూడాలి" అంది ఆ యువతి. తన మాటల్లో కొంచెం హేళనని ధ్వనింపజేస్తూ. అంతే తానామె రూపానికి ముగ్ధుడై ఆమెను వెంటాడి పరిచయం చేసుకున్నాడు. ఆయువతే జయప్రద!

గదిలోకి ఎవరో వచ్చినట్లు అలికిడి కావటంతో త్రుళ్ళిపడి లేచాడు సారది. వెంకటేశం గారు నెమ్మదిగావచ్చి కుర్చీలో కూర్చున్నారు. ఆయన ఆ యింటికి యజమాని. ప్రతినెల ఒకటో తారీఖున మాత్రం ఆయన సారథి దగ్గర వస్తాడు!

ఆయన రాకకుగల కారణం గుర్తుకు రావటంతో లేచి డబ్బు తెచ్చిచ్చాడు సారథి. వెంకటేశంగారు సారథి మంచితనాన్ని గుర్తించి మెచ్చుకుని వెళ్ళి పోయారు. ఆయనలా వెళ్ళగానే సారథి ఆలోచన శేషమ్మ మీద నిలిచింది.

శేషమ్మ వెంకటేశంగారి ధర్మపత్ని. వెంకటేశంగారికి నలభై అయిదేళ్ళుంటే ఆవిడకో ముప్పై అయిదో, ముప్పై ఆరో వుంటాయి. సారథికి ఆమె ఆకారం కళ్ళకు కట్టింది. వాలిపోయిన తోటకూరకాడల్లా చేతులు, కాళ్ళు, పాలిపోయిన ముఖం పీక్కుపోయినచెక్కిళ్ళు,

గుంటలుపడిన కళ్ళతో ఆమె కళావిహీనంగా వుంటుంది. ఆవయస్సుకే ఆమె పదకొండుమందికి జన్మనిచ్చి, తనురోగిష్టిగా మారి, తన బ్రతుకును నరకం చేసుకుంది. సారధికి ఆమె తలపుకు వచ్చినప్పుడల్లా తననిర్ణయం నూటికి నూరుపాళ్లు సరియైనదే అనిపిస్తూ వుంటుంది. లేకుంటే ఓ అందమైన యువతిని వివాహం చేసుకోవటం ఆపూర్వ సౌకుమార్యాన్నీ, లాలిత్యాన్నీ, లావణ్యాన్నీ అనుభవించి వాటిని నేలరాలేటట్లు చేయటం ? ఏమిటీ ఈ వ్యవస్థ! సారధికి ఆ అవస్థ తలచుకునేసరికి కళ్లు బైర్లు కమ్మినట్లైంది. బ్రతుకంటే ఒకవిధమైన జుగుప్స కలిగింది. ఏమైనా సరే తన నిర్ణయం మార్చుకోకూడదు. జయప్రద తనను ఒకపిచ్చివాడుగా భావించినా సరే. ఆమెకు రేపు దృఢంగా చెప్పేయాలి తననిశ్చయాన్ని..... ఆలోచనలతో బరువెక్కిన సారధి మేధస్సు నిద్రలోనొరిగి పోయింది.

* * *

“బుజువుకాని అబద్ధాలు నిజం కన్నా బలమైనవని ఎవరో అన్నారు. అలాగే వుంది రూపా నువ్వుమాట్లాడే ధోరణిచూస్తే. అంత విడమర్చి చెప్పినా నమ్మకపోతేఎలా?”

“మీరెన్నయినా చెప్పండి, ఇరుగు పొరుగు వాళ్ళంతా కాకులు పొడిచినట్లు పొడుస్తుంటే నాకూ మీమాటల్లో నిజం కనపడటం లేదు.”

భార్యవైపు జాలిగా చూశాడు మురళి. తన మాటలమీద లేనివిశ్వాసం వూళ్లో వాళ్ల వూసుపోక కబుర్లమీద చూపిస్తోంది రూప. ఆమెను నమ్మించాలని ప్రయత్నించటం వృథాశ్రమ అనిపించింది. దీర్ఘంగా నిట్టూర్పు విడిచి ప్రక్కమీద అవతలివైపు తిరిగేడు.

మురళి మనసులో ఆలోచనలురేగేయి. నెలరోజుల నుంచి రూపతో ఈవాదన జరుగుతూనేవుంది. అసలీ పొగరాజుకోవటానికి తానే కారణం. ఎప్పుడో నాలుగైదు నెలల క్రితం స్నేహితులతో కలిసి పిక్నిక్‌కు వెళ్లి వాళ్లందరి బలవంతాన 'కంపెనీ' కోసం డబ్బు పెట్టి పేకాడేడు. తన మనోనైర్మల్యాన్ని భార్యకుండా ప్రదర్శించి మెప్పుపొందాలని ఈ [illegible] రూపతో చెప్పి, ఆనాడు లాభించినదానికో ఏమో ఆమెకిచ్చాడు. ఆరోజే [illegible] ముఖంలో ఆందోళన గమనించాడు, ఆ



తర్వాత తానాసంఘటనను మరచిపోవటం, క్లబ్బులో రోజూ 'కాంట్రాక్ట్ బ్రిడ్జ్' ఆడుతూవుండటం జరిగి పోతూవుంది. ఈమధ్య కొన్నాళ్లనుంచీ ఆ అభ్యాసం రాత్రి పది పదకొండు గంటలదాకా సాగుతోంది. దానికి ఏరోజుకారోజు రూపకు సంజాయిషీ చెప్పుకోలేక సతమత మవుతుంటే ఇప్పుడీ వుప్పెన ముంచుకొచ్చింది.

నెలరోజుల క్రితం ప్రక్కింటి బామ్మ గారి బావగారి రెండో అమ్మాయి మొగుడూ, ఎదురింటి ఎల్లమ్మగారి మూడో తమ్ముడికొడుకు, అలాంటివారో నలుగురు దేశోద్ధారకులూ కలిసి తనమీద ఆనేరాన్నారోపించారు. ఆ శుభవార్త నలుగురి పెద్ద ముత్తైదువుల చెవుళ్లను కరచి పరుగెత్తుకొచ్చి, రూప చెవిలో దూరింది.

రూప వెనకెప్పుడో తాను నిజాయితీగా చెప్పిన నిజాన్ని ఆధారంచేసుకుని వో చిన్నకథ అల్లుకుని— తను 'చెడిపోయి నట్లు' చిత్రించుకుని తల్లిదండ్రులకు జాబు కూడా వ్రాసేసింది. అక్కడ్నుంచీ మామగారు తనను మందలిస్తూ, హితబోధ చేస్తూ నాలుగు కావుల కవరు వ్రాసేడు. “ఇదేమిటం”టే, “అవును నేనే మావాళ్లకి వ్రాశా” నంది రూప.

“ఇంతకీ మీరీ అలవాటు మానుకుని రేపట్నుంచీ ఆరింటికల్లా యింటికొస్తారా లేకపోతే....”

మురళి ఆలోచన తెగింది. రూపవైపు తిరిగి “ఆ లేకపోతే?” అని రెట్టించాడు.

రూప తడబడింది. ఒక్క క్షణం ఆలోచించి “లేకపోతే, నలుగురినోళ్లల్లో నానుతూ, నేనియాతన పడలేను...” అంది.

“మధ్య నీకేంయాతన? అమ్మానాన్నలకు నన్నో దుర్మార్గుడిగా చిత్రించి వ్రాసి 'చెడి పోయినవాడు'గా చూపావుగా”

“అదుగో మాటిమాటికీ వాళ్లను తెస్తారెందుకు?”

“వాళ్లను తెచ్చే దేమిటి? వాళ్లూ నువ్వూ కలిసి నన్నో బజారుకీడ్చారు. అయిన వాళ్లందరిలో నన్ను పేకాట ప్రబుద్ధుడుగా, జూదగాడుగా ప్రచారంచేసి నా పరువు తీశారు.” మురళి కంఠంలో బాధ తొణికింది. నిష్ఠూరంగా అంది రూప

“అంతబాధ పడేవాళ్ళు ఆ వ్యసనాన్ని వదిలి వేయరాదూ”

మురళి మండి పడ్డాడు “నేనసలు మాననేమానను. ఏమిటి నీదాష్టీకం. నేనే పాపమెరుగనంటుంటే చంపుతావేం? రేపట్నుంచీ పట్టు పట్టి పేకాడుతాను డబ్బుపెట్టి. వచ్చిన వాదెలాగూ వచ్చింది. ఇంకెందుకు....”

రూప కూడా అంతకంత రెచ్చిపోతూ అంది. “అలాగైతే నేనూ ఒక్కక్షణం యిక్కడుండను.”

“ఉండకపోతే వూరేగు” మురళి విసుగ్గా లేచి బట్టలు కూడా మార్చుకోకుండా వెళ్లి పోయాడు.

వెళ్తున్న మురళివైపు ఉక్రోషంతో సజలాలైన కళ్లతో చూస్తూ వుండి పోయింది రూప.

* * *

“నీ ప్రవర్తన నాకీమధ్య బొత్తిగా అర్థంకావటం లేదు, చాలా పిచ్చిగానూ వుంటోంది”

రాజావైపు ఆశ్చర్యంగా చూసేడు మురళి.

“అంటే— ఏమిటి నీవుద్దేశ్యం?”

“ఉద్దేశ్య మేంవుంది మొన్నటికిమొన్న ఆ యూనియన్ ప్రెసిడెంట్‌దగ్గర...”

“అప్పుడు నేనేం పరువు తక్కువ పని చేయలేదు”

“పరువు పోవాలా ఏం? మనమిద్దరం ఏదో అనుకుంటూ వుంటే, ఆయన్ని పిలిచి 'మా ఫ్రెండ్‌కి వో అనుమానంవచ్చిందండి. మీరు క్రిందటేడు మధ్యలో ప్రెసిడెంట్‌షిప్‌కి రాజీనామా యిచ్చి దాన్నుంచీ విరమించుకుని ఇప్పుడు మళ్లీ ఎలక్షన్స్‌లో నిలిచారేం?' అని నన్ను చూపుతూ అడిగితివి. దాని కాయన ఎంత వుపన్యాసమిచ్చాడూ? మధ్య, మధ్య నా మీద అక్షింతలేస్తూ, ఆయన మాట్లాడిన మాటలు నీకూ తెలుసుగా. ఆవేళ నాకు నిజంగా చాలాబాధ కలిగింది. కోపమూ వచ్చింది.”

మురళి తలవంచుకుని అన్నాడు “ఆ ఏదో సరదాకి అంటే ఏం మునిగి పోయిందేం?”

“అదుగో అదే నేను 'సిల్లీ'గా వుంటటం అనేది. న్యాయంగా చెప్పు. ఆ ప్రసక్తి తీసుకొచ్చింది నువ్వుకదూ? నన్నుచూపి

వినడుగుతున్నావని ఎందుకడగాలి?"

మురళి మాట్లాడలేదు.

"అదేంగాదు. ఇలాంటివి ఈ మధ్య చాలా జరిగేయి. నా మంచితనాన్ని తీసు కుని నువ్వు జపహరింటానంటే ఏలా?" రాజా బాధగా అన్నాడు.

"నేనేం అంత చులకనగా చూడటం లేదు నిన్ను."

"చూడక పోవటమేమిటి? నీలోని బలహీనతలన్నీ దాచుకుని ప్రతివిషయం లోనూ నన్ను 'ఎక్స్‌పోజ్' చేస్తూ వేస్తున్నావు నీవు. ఉదాహరణకి ఎన్నన్న క్లబ్‌డే పాటీ ఆప్పుడు నీకు మనస్సు బాగాలేదనీఇంటోల్లో నీభార్యతో పేచీగావుందనీ చెప్పి నన్ను మాన్పించి, లీలా పదిమంది ముందు నా తప్పులేక పోవటంవల్ల మానేయాల్సొచ్చిందని చెప్పవి. ఎలావుంటుందిచెప్పు? చిన్నప్పట్నుంచి సన్నెంతగా అర్థంచేసు కున్నా, ఎన్ని విషయాల్లో సర్దుకుపోగలను..."

మురళి ఊగిగా మౌనంగా ఏహించాడు

రాజా చెప్పసాగేడు "అదిగాక డబ్బు విష యంలో కూడా నీ పద్ధతి బాగాలేదు..."

మురళి తలెత్తి ఆదోలా రాజాకళ్ల ల్లోకి చూసేడు.

"అవును. నువ్వూ, నేనూ ఎంత చను వుగా వున్నా ఆఫీసు జవాన్లద్వారా ఉత్త రాలు వ్రాసి పంపటం.. చూసేవాళ్లం దరికీ అక్కడికి నేనేదో అప్పాధికారిలా కనపడటం. ఆతీసుకొనేదేదో గోప్యంగా తీసుకోవచ్చుగా?"

"అంటే నువ్వేం నాదగ్గర తీసుకో లేదనీ, నేనే నిన్ను పదేపదే యాచిస్తున్నా ననా?"

మురళి కంఠస్వరంలో ఆవేశం ధ్వనిం చింది.

"అదుగో ఎందుకలా ఆవేశపడతావ్? నేనలా అన్నానా. అవసరమనేది ఎవరి కైనా కలుగుతుంది. స్నేహితులం కనుక ఇచ్చి పుచ్చుకోవటంలో తప్పులేదు...."

రాజామాటల్ని మధ్యలోనే త్రెంచేసి అన్నాడు మురళి "ఎందుకులే రాజా! నీ అంతర్యం నాకిప్పుడు బోధపడిందిగా. నువ్వు నాకు గొప్పసహాయం చేస్తున్నావ్, చాలు.. చెప్పదలచుకున్న దేమిటోసూటిగా చెప్పక పోయినా, గ్రహించే జ్ఞానం నాకూ వుంది.... వొస్తా. ఇప్పటికైనా బయట పడ్డావ్"

"మురళీ!" రాజా బాధగా పిలిచాడు

"ఇంతేనా - నీకర్థమైంది?"

"అవును.. నీతత్వం బాగా అర్థమైంది. రేపే నీకివ్వాల్సిన డబ్బంతా లెక్కచూసి తెచ్చిస్తాను. ఈ మాత్రం అప్పు మరో చోట దొరక్కపోదు. దానం, ధర్మమేం కాదుగా!"

రాజా మనస్సు నొచ్చుకుంది. బాధగా అన్నాడు. "మురళీ! చివరికి నువ్వీస్థితి కొచ్చావన్నమాట. నేను నీకేదో సహాయం చేస్తున్నాననే భావం నాలోవుంటే ఇలా నుందలించి వుండేవాణ్నేకాదు. తెలుసా?"

"అన్నీ తెలిసినవే. కానీ, ఇంక నా గురించి బాధపడకు. మనస్పర్థలు రానే రాకూడదు గానీ, వచ్చిన తర్వాత స్నేహం సాగదు."

"మురళీ!" ఉద్వేగంతో అరిచేడురాజా.

మురళి లేచి బయల్దేరబోతూ ఆగి అన్నాడు "ఔను రాజా! మాట పట్టు దల గల మనిషిని నేను...."

సాగిపోతున్న మురళిని అలాగే చూస్తూ వుండి పోయాడు రాజా!

* * *

మర్నాడు, సారధి ఇంటికొచ్చింది జయ ప్రద— ఆకసంలో వోతారిక ఉదయించి నట్లు, సాగరగామిని సాగరుణ్ణి చేర నున్నట్లు.

మౌనాన్ని భంగపరుస్తూ అడిగింది జయప్రదే— "మీ ప్రయాణం ఎంత దాకావచ్చిం"దని.

సారధి అదోలా ఆమె కళ్లల్లోకి చూస్తూ, "విశాఖ పట్టణందాకా వెళ్లా లనే నిశ్చయించుకున్నాను." అన్నాడు గంభీరంగా.

జయప్రద నివ్వెరపడి "ఆ!" అంది.

"అవును" అంటూ ఎంతో దృఢంగా వివరాలు చెప్పేడు సారధి. నిరాశతో శలవు తీసుకుంది జయప్రద.

* * *

మర్నాడు, నిద్రలేచేసరికే ప్రయాణ సంరంభం పూర్తిచేసుకుని బయల్దేర టానికి సిద్ధంగా కూర్చుంది రూప.

మురళి ఆమె పట్టుదలకు ఆశ్చర్య పోయినా ఆమెనుమాత్రం ఏమీ ప్రశ్నించ లేదు.

దీనితో రూప అహం ఇంకా దెబ్బ తింది. పనిమనిషిని పిలిచి, మురళిచూస్తూ ఉడగానే చెప్పింది. "వేవెళ్తున్నట్టు మీ అయ్యగారితో చెప్పవే" అని.

పనిమనిషి భార్యాభర్తలవంక విడ్డూ రంగాచూస్తూ నిలబడి పోయింది.

రూప వెళ్లిపోయింది!

* * *

మర్నాడు, రాజా ఆఫీసులోవుండగా పోస్ట్‌మేన్ వో ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవరు తెచ్చియిచ్చాడు. దాన్ని తీసిచూసిన రాజా ఆశ్చర్యచకితుడైనాడు. పదహారు వందల ముప్పైమూడు రూపాయలకొక డ్రాఫ్టూ దానికి సంబంధించిన లెక్కవుంటూ, చిన్న వుత్తరం ఉన్నాయందులో.

ఉత్తరంలో యిలావుంది."సిగ్గీ ప్రవ ర్తనగలిగిన నాలాంటివాడితో యింత వరకూ స్నేహం చేయగలిగిన నీమంచి తనానికి కృతజ్ఞతలు. సెలవ్—మురళి"

* * *

ఆంధ్రరాజధానిలో ఆవ చిత్రకళా ప్రదర్శనం ఏర్పాటుచేస్తూ, మురళికీ, రాజాకూ విడివిడిగా ఆహ్వానాలు పంపేడు సారధి. రాజాకు మరీమరీ వ్రాసేడు కల్యాణిని తీసుకరమ్మని.

సారధి బసలో రాజాను, కల్యాణిని చూసి మురళి ఎంత ఆశ్చర్యపోయాడో— మురళిని చూసి రాజా అంత ఆశ్చర్య పోయాడు. అయితే అంతరాంతరాలలో ఇద్దరికీ— మిత్రులు ముగ్గురూ కలుసుకో గలిగినందుకు సంతోషమే కలిగింది.

ఈ సందర్భంలోనే ముగ్గురూ మనసు విప్పి ఒకరివ్యధ మరొకరికి చెప్పుకో టానికి అవకాశం ఏర్పడింది.

సంభాషణ జయప్రద మీదకు మళ్లి నప్పుడు అంది కల్యాణి "ఆ బేలహృదయం నీ నిరాదరణకు ఎంతకృంగి పోయిందో" అని.

దానికి సమాధానంగా చెప్పేడు సారధి "ఆమె ఎక్కడవుంటున్నదో తెలుసుకుని ఆహ్వానం పంపాలని శతధా ప్రయత్నించాను కానీ, నావల్లకాలేదు. వాళ్లన్నయ్యకు ఢిల్లీ ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోయారని తప్ప మరేవివరాలు అందలేదు."

చివరికి మానసికంగా మిత్రులు ముగ్గురూ అశాంతిగావున్న దుస్థితికి చింతిం చింది కల్యాణి.

కళాప్రదర్శనం ప్రారంభించిన మూడో రోజున...

రాజు, సారధి, కళ్యాణి, మురళి కలిసి థియేటర్ లాంజ్‌లో కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు .... ఉన్నట్లుండి సారధిదృష్టి థియేటరులో నుంచి వస్తున్న ఒకవ్యక్తిమీద నిలిచింది. లేచివెళ్లి "నమస్తే" అంటూ పలుకరించాడు. ఆయన ప్రత్యాభివాదం చేస్తూనే విస్తెరపోయాడు, సారధినిచూసి!!—

క్షణాల తర్వాత సారధే అన్నాడు "మిమ్మల్నెక్కడో చూసినట్లుందండీ" అని.

ఆయన తన బుంగమీసాల్లో నుంచి చిత్రంగా నవ్వి "నన్నెక్కడ చూసివుంటావ్ బాబూ" అని "నీపేరు?" అని అడిగేడు

సారధి వినయంగా తానే సీ.సా. అన బడే చిత్రకారుణ్ణని పరిచయం చేసుకున్నాడు. వెంటనే సారధికే స్ఫురించింది— ఆ పెద్దమనిషి తాను జయప్రదను కలిసినరోజున బస్సులో చూసినవ్యక్తి అని. ఆ వివరమంతా చెప్పి ఆయన్ను తమ దగ్గరకు ఆహ్వానించాడు.

"వీరు మంచి కళాభిజ్ఞులు. విమర్శకులు" అని ఆయన్ని మురళి, కల్యాణి, రాజులకు పరిచయం చేశాడు సారధి.

ఆయన తనపేరు 'లోకనారాయణ' అనీ, పూర్వాశ్రమంలో శాంతినికేతన్‌లో చిత్రకళ నేర్చుకున్నానని తన్ను తాను పరిచయం చేసుకున్నాడు.

సారధి ఆశ్చర్యపోయాడు. ఆయన పట్ల అతనికున్న గౌరవాభిమానాలు రెండింతలైనాయి. తమతోపాటు ఆయన్నీ తనబసకు తీసుకవెళ్లాడు.

ఆరోజురాత్రి— ప్రసంగవశాత్తూ సారధి నడిగారు లోకనారాయణగారు "నీకు వివాహమైందా బాబూ!" అని.

రాజు ఉన్న విషయం చెప్పేడు, సారధి ఆశయాన్ని గురించి, అతనికి వివాహమంటే గల వైముఖ్యాన్ని గురించీ, ఆసందర్భంలోనే ముగ్గురు మిత్రులూ మూడురకాలైన వ్యథలకు గురై బాధ పడటాన్నిగురించి ఆయనకు తెలిపింది కల్యాణి.

అన్నీవిన్న లోకనారాయణగారు వేదాంతిలా చిరునవ్వు నవ్వి చెప్పసాగేరు "నేనూ ఎన్నెన్నో ఆదర్శాలతో జీవితాన్ని ప్రారంభించి, ఆదర్శాలన్నీ పేలపిండిలా కొట్టుకుపోగా, అనుభవాల్నిమాత్రం సేకరించుకుని నిలిచినవాణ్ణి సారధి. నీవనుకుంటున్నట్లు నిజమైన కళారాధకుడు సౌందర్యాన్ని అనుభవించటానికి జంకటం నిజమే. నేనూ ఒకప్పుడు మీలాగే యీ ఆశయానికీ స్నేహానికీ గొప్ప విలువ నిచ్చిన వాడ్ని. అందుకనే ఈ నాడిలా 'నా' అన్న వారులేకుండా ఏకాకిగా దేశంవెంటతిరుగుతున్నాను...."

ఆయనకంఠం వణికింది. ఒక్క క్షణం ఆగిమళ్లీ చెప్పటం మొదలెట్టేరు "ఆదర్శానికీ, నిజజీవితానికీ గొప్పవ్యత్యాసం వుంటుంది, వుంది. మన ఆదర్శాలు, ఆశయాలు వ్యక్తిగతమైనవిగా కాక, సంఘపరమైనవిగా వున్నప్పుడే రాణిస్తాయి. ప్రవాహానికి ఎదురీది నిలవలేని మనం కొన్ని కష్టసాధ్యమైన ఆదర్శాలమీద నిలబడ కూడదు. పైగా మీ దృష్టి నుంచి ఆలోచించినా సౌందర్యం కానీ, అందంకానీ, స్నేహంగానీ, సంసారంగానీ ఇవన్నీ ఓ చక్కనిగాజు పాత్రవంటివి. దానిలో జీవంనింపి ఉపయోగించుకుంటే మనకు ఉపయోగ పడుతుందది. అంతేగాని చేజారవిడిచి, సాధించే ప్రయోజనమేంవుంది? ఆలోచించండి రాజూ!మురళీ!! స్నేహాన్ని ఓ పవిత్రమైన బంధంగా భావించి పెనవేసుకుపోవాలి కానీ, ఇలా తాత్కాలికావేశాలకు లోనై తెంపుకుంటారా? మురళీ! సంసారమనేది అందమైన ఓ గాజుపాత్ర. దురభిమానాలకూ, అహంకారాలకూ లోనుగాక దాన్ని పరిరక్షించుకుంటేనే మన సంస్కారం సఫలమవుతుంది. ఏమంటావ్ సారధీ! నీవూ ఆలోచించు. నీ భవిష్యత్తును దృష్టిలో వుంచుకుని ఒక నిర్ణయానికిరా. చూస్తివిగా నాలా జీవనసంధ్యలో ఏకాకిగానిలచి చేసినతప్పుకు వగచే దుస్థితి నీకు కలగ రాదనే నా ఆకాంక్ష."

లోకనారాయణగారు చెప్పటం ముగించి అందరి ముఖాల్లోకీ ఒకసారి పరీక్షగా చూశారు.

వీరందరికీ ఏదో చైతన్యస్రవంతిలో మున్కలు వేసినట్లైంది. హృదయాలలో ఏవేవోభావాలు మొలకెత్తగా అలా ఆలోచిస్తూ వుండిపోయారు.

వారిలో ఆమాత్రం భావసంచలనం కలిగించ గలిగాననే తృప్తితో కాబోలు, గాఢంగా వూపిరి పీల్చుకున్నారు లోకనారాయణగారు!

*

అందమైన తరుణీమణికోసం అన్వేషణ ప్రారంభించాడు సారధి! పరస్పరం క్షమార్పణలు కాకున్నా, అలాంటిఇంగ్లీషు మాటలు చెప్పుకుని చేతులు కలిపేరు మురళీ, రాజు!! దెబ్బతిన్న అహాన్ని అనురాగంగామార్చి రూపని తీసుకొచ్చాడు మురళి!!!

మళ్లీ మొదలైంది కథ!!!!






అద్దంముందు నిలబడి ఉల్లాసంగా ఈలవేసుకుంటూ టై కట్టుకుంటు న్నాడు డాక్టర్ హరీష్‌కుమార్.

"ఏంబాబూ. ఇంకా కాలేదూ? త్వరగా వెళ్లాలన్నావ్" కొడుకింకా గదిలోనే వుండటం చూసి అక్కడికే టిఫిన్ తీసుకొచ్చిన పద్మావతి అంది.

"అయిపోయిందమ్మా. ఇదుగో ఒక్కక్షణం." టై కట్టుకోటం పూర్తి చేసి వోసారి చేత్తో క్రాపు సరిజేసుకుని వెనక్కి తిరిగి తల్లి చేతిలో ప్లేటు అందుకున్నాడు.

కాఫీ త్రాగుతుంటే, "ఎవరో గోపాలం గారుట, వచ్చారు మీకోసం" అంటూ వచ్చాడు చంద్రయ్య.

ఓసారి వాచీకేసి చూసుకుని, "కూర్చోమను. వస్తున్నా" అన్నాడు హరీష్.

డాక్టరుగారిని చూస్తూనే మర్యాదగా లేచి నిలబడి నమస్కారం చేశాడు గోపాలం.

హరీష్ ప్రతి నమస్కారం చేసి, "కూర్చోండి. మీ ఫాదరు కెలాగుంది" అన్నాడు.

"మీ దయవల్ల ఆయన బాగానే ఉన్నారు—మా ప్రక్కింట్లో ఉంటున్న సుదర్శనంగారికి 'పెరాలిటిక్‌స్ట్రోక్' వచ్చింది. మీరొకసారివచ్చి చూడాలి" అన్నాడు గోపాలం నిలబడే.

"ఇప్పుడా. నా కివాళ చాలా అర్జంటు కేసులున్నాయి" అంటూ గోపాలాన్నిచూసి, "సరే పదండి" అన్నాడు కారు దగ్గరికి నడుస్తూ. గుమ్మంలో కారు ఆగగానే ఆదుర్దాగా పరుగెత్తుకుంటూ వచ్చిన అమ్మాయిని,

"ఈవిడ మంజుల. వీళ్ల మామయ్యకే జబ్బుగావుంది" అని పరిచయంచేసి,

"మీరు చూస్తూవుండండి. నేను మళ్లీ వస్తాను—ఈవిడ ఖంగారుపడుతూవచ్చి చెప్పే వరికి ఉన్నవాడిని వున్నట్లు బయలుదేరాను. ఇంకా స్నానం అదీ ఏమీ కాలేదు" అని డాక్టరుదగ్గర శలవు తీసుకుని వెళ్లబోతూ,

"డాక్టరుగారికి అన్ని సంగతులూ చెప్పండి. నేను సాయంకాలంవచ్చి కనిపిస్తాను" అన్నాడు మంజులతో.

"మీకు చాలా శ్రమ యిచ్చాను. ఆఫీసువేళ దాటిపోయిందేమోకూడ" కొంచెం సిగ్గుపడుతూనే గోపాలానికి కృతజ్ఞత చెప్పుకుని అతను అటు వెళ్లగానే డాక్టర్ని లోపలికి తీసుకువెళ్లింది.

ముందుగా గదిలోఅడుగుపెట్టిన మంజుల "మామయ్యా. డాక్టరుగారొచ్చారు." అంది మెల్లిగా.

కళ్లమీద చేయి ఆన్చుకుని దిగులుగా ఏదో ఆలోచిస్తూ పడుకున్న సుదర్శనంగారు, చేయి తీసేసి ప్రక్కకి చూశారు. చటుక్కున ముందుకు వచ్చి కొంగుతో ఆయన కళ్ళు మొహం తుడిచింది మంజుల.

హరీష్‌వచ్చి మంచం దగ్గరగావున్న కుర్చీలో కూర్చుని ఆయన్ని పరీక్షచేస్తూ,

"మీరు మరీ అంత భయపడకూడదు" అన్నాడు. కన్నీళ్లనోడ్చి వోడ్చి ఉబ్బిపోయి, బెదురుగా చూస్తున్న ఆయన కళ్లల్లోకి చూస్తూ, ధైర్యం చెప్తున్నట్లు. వెంటనే ఆయన చూపులు క్రిందికివాలిపోయాయి.

"హు. భయం—భయం నా కెందుకు?" అస్పష్టంగా గొణిగారు. భయంతో బిగుసుకుపోయిన గొంతు పెగల్చుకొని.

ఇంతలో ఓ నడి వయసు స్త్రీ విలాసంగా నడుచుకుంటూ వచ్చింది గదిలోకి. చూడగానే ఎబ్బెట్టుగా అనిపించే ఆవిడ అలంకరణని ఒక్కక్షణం రెప్ప వాల్చకుండా చూసి, ఆమె ఎవరైవుంటుందో వూహించుకుంటూవుంటే, తన వూహ నిజంచేస్తూ,

"మా అత్తయ్య" అని పరిచయం చేసింది మంజుల.

"ఇది ఎన్నాళ్లకి తగ్గుతుందంటారు?" చిత్రంగా కళ్లుతిప్పుతూ తనని పలకరించిన వ్యక్తిని ఒక్కక్షణం ఆశ్చర్యంగా చూసి,

"ఏమో. ఇప్పుడే ఏమీ చెప్పలేను" అన్నాడు హరీష్ కనుబొమలు ముడిచి కాస్త చికాగ్గా. అతనికి మరీ అంత విసుగు రావడానికి కారణం— ఆవిడ కంఠంలో భర్త అనారోగ్యాన్ని గురించిన దిగులు ఆదుర్దా ఏమాత్రంలేవు సరికదా, తన కెంత మాత్రం సంబంధంలేని వ్యక్తికి కాస్త జలుబు చేసినంత నిర్లక్ష్యంగా, నిశ్చింతగావుంది.

"ఆ కాలు అయినా కాస్త త్వరగా స్వాధీనంలోకి వచ్చేటట్లు చూడలేరా? బొత్తిగా మంచంమీదనించి లేవలేకపోతే ఎలా చెయ్యాలిబాబూ. నా కసలే జబ్బువాళ్లని చూస్తేనే భయం" అభయం అంతా కళ్లలో వ్యక్తం చేస్తూ అడిగింది జానకి.

ఆవిడ ధోరణిని అసహ్యించుకుంటూ, ఓసారి మంజులవైపు చూశాడు హరీష్. సిగ్గుతో అవమానంతో వల్లబడిపోయిన ముఖాన్ని క్రిందకి వంచేసుకుని మంచాన్నానుకుని నిలబడిపోయివుంది కొంగు వేలికి మెలిపెడుతూ.

తలతిప్పి సుదర్శనంగారి మొహంలోకి చూశాడు. ఆయన బాధగా కళ్లు మూసుకు పడుకున్నారు. మూసివున్న ఆ కనురెప్పలక్రిందనించి కన్నీళ్లు ప్రక్కలకి జారిపోతున్నాయి.

"మీరు నాకో ఉపకారం చేసిపెట్టాలి" బ్రతిమాలుకుంటున్న ధోరణిలోవున్న ఆవిడ మాటలు విని ఏమిటన్నట్లు అటు తిరిగి చూశాడు.

"ఈయన్ని ఏదైనా ఆస్పత్రిలో జేర్పించే ఏర్పాటు చేయగలిగారంటే......"

"అత్తయ్యా!" మంజుల గుండెలను చీల్చుకువచ్చిన ఆర్తనాదంతో, సుదర్శనంగారి హృదయ విదారకమైన మూలుగు కలిసిపోయింది.

"సరే అయితే, ఆస్పత్రికే తీసుకువెళ్లండి. మరి నే వస్తా." అని బ్యాగ్ సర్దుకుంటూ అప్రయత్నంగా సుదర్శనంగారివైపు చూశాడు. అతని గుండె పట్టుకుపోయింది. జాలిగొలిపే ఆ నేత్రాల మూగ కన్నీటి దృష్టి అతనిని బంధించివేసి అడుగు ముందుకువేయలేని అశక్తుణ్ణి చేసింది.

"ఈయన్ని ఇలాంటి నిస్సహాయస్థితిలో వదిలేసి వెళ్లిపోవడం డాక్టరుగా నా ధర్మం కాదు— శరణాలయవాసులకి ఉచితంగా వైద్య సహాయం చేయగలుగుతున్న నేను, ఈ ఒక్క వ్యక్తి ఫీజు ఇవ్వలేకపోయినంత మాత్రాన పెద్దగా నష్టపోయేది ఏమీ ఉండదు—తోటి మానవుడికి సహాయం చేశాననే తృప్తి ఉంటుంది—కాని ఈఇంట్లో ఇలాంటి మనుష్యులమధ్య నేనేంచేసినా బూడిదలో పోసిన పన్నీరే అవుతుందేమో. కట్టుకున్న భార్యకే లేనిబాధ, జాలి మధ్య నాకేమిటి?" ఎటూ నిశ్చయించుకోలేక, ఏం చేయాలో తోచక అలాగే నిలబడిపోయిన హరీష్‌ని,

"ప్లీజ్, వెళ్లిపోకండి. మామయ్యని ఆస్పత్రిలో జేర్పించండి. మీరేట్రీట్ చెయ్యాలి. ఇంజక్షన్లకీ, మందులకీ ఎంత డబ్బయినా ఫరవాలేదు. ఎలాగయినా ఈయన్ని మామూలు మనిషిని చేసే భారం మీదే" అన్న మంజుల మాటలు లోకంలో పడేశాయి.

మంచం ప్రక్కనే నిలబడి ఆప్యాయంగా తన చేయి నిమురుతున్న మేనగోడల్ని అభిమానపూర్వకంగా చూసుకుంటూ, ఒక్కసారి కళ్లుతిప్పి, సిరింజిలోకి మందు ఎక్కించబోతున్న డాక్టరు కళ్లల్లోకి

చూశారు సుదర్శనంగారు. అదే చూపు— అతనిలోని అణువణువు విచిత్రమైన స్పందనకు గురి అయేలాచేసే మహత్తరమైన దృష్టి అది.

"అభిమానాలకేం లోటులేదు. ఇలాంటి రోగాలకి ఎంత డబ్బు అవుతుందో తెలుసా? అయినా మంచంమీదవున్న మనిషికి చాకిరీ చెయ్యటం మాటలు చెప్పినంత సులభంకాదు. ■ పని వావల్ల అసలేకాదు." అని మంజుల నుద్దేశించి జానకి అంటున్న మాటలని కూడ లెక్క చెయ్యకుండా హరీష్ సుదర్శనంగారికి ఇంజక్షన్ ఇస్తూంటే పసిపిల్లవాడిలా సంబరపడుతూ అతని కళ్ల ల్లోకి చూశారు ఆయన. ఆ ఒక్క చూపే కొన్నివేల మాటలు చెప్పగలిగే కృతజ్ఞతా భావాన్ని వ్యక్తం చేసింది.

"డబ్బు కేమిటత్తయ్యా. ఎలాగో చూసుకుందాం. మామయ్యకంటే ఎక్కువా ఏమిటి? ఇంక సంరక్షణకంటావా...... ఎవరెనైనా మనిషిని పెడదాంలే" తల వంచుకునే ఆవిడికి సమాధానంచెప్పి, మేనమామ సర్దుకుని పడుకునేందుకు సహాయపడి దుప్పటి సరిగ్గా కప్పింది మంజుల.

"ఈయన మంచంలోవుంటే నెల నెలా వచ్చే జీతం రాళ్లు కూడ రావు......" ఇంకా ఏదో అనబోయి, "ఇంకా కాఫీ కాలేదూ?" అన్న గావుకేక విని లోపలికి వెళ్లిపోయింది జానకి.

బ్యాగ్ సర్దుకుని వచ్చేస్తున్న డాక్టర్ని అనుసరించింది మంజుల. గడులు దాటి వస్తూంటే,

"నాన్నగారికి పక్షవాతం వచ్చింది" అని చెప్తున్న జానకి కంఠం వినిపించింది.

"ఐతే, ఇక బ్రతక డంటావా?" ఆదుర్దా లేశమాత్రమైనా లేని కుతూహలంతో, చావుఅనేది అతిసామాన్యమైన విషయంలా అడుగుతున్నాడు శంకరం.

"ఏమో ఏంచెప్పగలం. ఈలోగా బోలెడు డబ్బు మాత్రం వదులుతుంది." చికాగ్గా జవాబు చెప్పింది జానకి.

అప్రయత్నంగానే తలెత్తి డాక్టర్ మొహంలోకి చూసిన మంజుల సిగ్గుతో కుంచించుకుపోతూ త్వరత్వరగా వరండాలోకి వెళ్లిపోయింది.

"పొద్దున్నే అర్జంటు కేసులన్నీ వదిలి పెట్టి ఇలాంటి ఇంట్లోకి వచ్చి పడ్డావేమిటి," అనుకుంటూ కాస్త చికాగ్గా వచ్చిన డాక్టర్నిచూస్తూ, "మీఫీజు?" అంది మంజుల తలవంచుకునే.

# అర్ధాంగి

"ఏం? మీ రిస్తారా?" అతనికి తెలియకుండానే గొంతులో ఏవిధమైన నిర్లక్ష్యం అవహేళన చోటు చేసుకున్నాయి.

"అవును. కాని ఇప్పుడే ఏమీ ఇవ్వలేను. మీరు కాస్త వారం రోజులు ఆగాలి."

ఆమాటలు వినిపించుకోనట్లు రెండడుగులు ముందుకి వేశాడు హరీష్.

"నామాటలలో మీకు నమ్మకం కలగడం లేనట్టుంది. ఐనా ఇప్పుడు ఇంతకన్న వివరించి చెప్పలేను. కాస్త ముందు వెనకగా మీ ఫీజు మొత్తం నేను చెల్లించుకుంటాను. నామాటమీద విశ్వాసంవుంచి మీరు రోజూ వచ్చి మామయ్యని చూసి మందిస్తూండాలి" లోకంలోని దైన్యం అంతా గొంతులో నింపుకుని ప్రాథేయపడుతూ అతనివెంటే నడవసాగింది మంజుల.

"ఆయనేం ఉద్యోగం చేస్తూండేవారు.?" ఆమె మాటలకు కొద్దిగా కరిగి, అసలు సంగతి తెలుసుకోవాలనే కుతూహలంతో అడిగాడు హరీష్.

మంజుల చెప్పింది విని, "అయితే నాలుగు వందలదాకా జీతం వస్తూండాలే! వైద్యం చేయించుకోడానికి కూడ డబ్బు లేకపోవటం ఏమిటి?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"అదంతా ఆయన చేజేతులా చేసుకున్న ఖర్మ. వివరాలేమీ ఇప్పుడు నన్ను అడక్కండి" అంది బెదురుగా లోపలికి చూస్తూ.

అతనింకా ఏదో అడగబోతుంటే,

"మీరుమాత్రం వైద్యం విషయంలో ఆయన కెలాంటిలోపం జరగకుండా చూడాలి. ఎంత ఖరీదైన మందులు వాడాల్సివచ్చినా ఫర్వాలేదు. ఆ డబ్బుఅంతా నేను నెమ్మదిగా తీర్చుకుంటాను. డబ్బు లేక ఆయనకి సరిఅయిన చికిత్స జరగలేదు— అనే బాధ మాత్రం నాకు లేకుండావుంటే చాలు. అదొక్కటే నేను మిమ్మల్ని కోరుకుంటున్నాను" కన్నీళ్లతో నిండిన కళ్లు ఎత్తి అతనివంకే చూస్తూ అంది.

"మీకా భయం, అనుమానం ఏమీ అక్కర్లేదు. ట్రీట్‌మెంటు విషయంలో మీ మామయ్యగారి కెలాంటిలోపం రానివ్వను. ఫీజు విషయంకూడ మీరేమీ బెంగ పెట్టుకోకండి. దానికోసం హైరానపడి ప్రయత్నాలేమీ చెయ్యవద్దు" అని, ఇంట్లో వాళ్లిద్దరి పరిస్థితి ఏమిటో తెలుసుకోలేక, వారి దీనస్థితికి జాలిపడుతూ వెళ్లి స్టీరింగుముందు కూర్చున్నాడు.

"థ్యాంక్సు. మీ మేలు మరిచిపోను. మామయ్య మళ్లీ మామూలుగాలేచి తిరిగేలాచేసే భారం మీదే" రెండు చేతులూ జోడించి, శలవు తీసుకుంటూ అంది మంజుల.

"భయపడకండి నాశక్తి వంచనలేకుండా ప్రయత్నిస్తానని చెప్పానుగా."

కారు కదిలిపోయింది.

* * *

"బస్సుకోసం వెయిట్ చేస్తున్నారా ?" దాదాపు నిర్మానుష్యంగావున్న వీధిలో ఆ కనుచీకటివేళ ఒంటరిగా నిలబడి బెదురుగా ఇటూ, అటూ చూస్తూ పరధ్యానంగావున్న మంజుల తన ముందు కారు ఆగడం గమనించలేదు. కాని తననే ఉద్దేశించి అన్నట్లున్న మాటలు వినబడి ఉలికిపడి ఇటు తిరిగింది. ఎదురుగా చిరునవ్వుతో స్టీరింగ్‌ముందు కూర్చున్న డాక్టర్ హరీష్ కుమార్.

ఒక్కసారి ధైర్యంగా గుండెలనిండా వూపిరి పీల్చుకుని ఏదో చెప్పబోయేంతలో,

"రండి. ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను" అంటూ చెయ్యిజాచి కారు డోర్ తెరిచాడు. అంతవరకు ఆమె కళ్లల్లో నీడలు పరుచుకున్న బెదురూ, భయమూ, తనని చూడగానే ఆమెలో కలిగిన మార్పూ ప్రత్యక్షంగా గుర్తించగలిగా డతను.

"థ్యాంక్సు." అని తడబడే కాళ్లతో కారు దగ్గరికి వెళ్తూంటే,

"ఎదురు తెన్నులు చూచేనే.......కనులు కాయలు కాచెనే.....కలలన్నీ ఫలియించెనే?" అంటూ అక్కడికి కొద్దిదూరంలో గుంపుగా నిలబడిన నలుగురు పాట పాడుతున్నట్లు దీర్ఘాలు తీశారు.

మంజుల అదేం వినిపించుకోనట్లువెళ్లి కారులో కూర్చుంది.

"హాచ్" నోటితోనే తుమ్మాడొక అప్రాచ్యుడు.

నోటిలో రెండు వేళ్లు పెట్టుకుని తనకు చేతనయినంతగట్టిగా ఈలవేశాడు మరోప్రబుద్ధుడు. నలుగురూ గోలగా చప్పట్లు కొట్టారు.

హరీష్ మవునంగా కారు స్టార్టుచేశాడు.

"ఛీ. ఛీ. వెధవ రవుడీ మూక. ఆడపిల్ల ఒంటరిగా కనిపించేసరికి ఒళ్లుమరిచిపోతారు. సభ్యత సంస్కారంలేని ఇలాంటివాళ్లని ఉపేక్షించి వూరుకోకూడదు. గట్టిగా బుద్ధి చెప్పాలి." ఏమీ చేయలేకపోయిన నిస్స

నాయితతో, రోషంతో ఎఱ్ఱబడిన ముఖాన్ని ప్రక్కకి తిప్పుకుంటూ అంది మంజుల.

"మరెందుకు చెప్పలేదు?" రోడ్డు మీదనుండి దృష్టి తిప్పకుండానే అన్నాడు హరీష్, గొంతులో ఎలాంటిభావం వ్యక్తం కానీయకుండా.

చివ్వున తలతిప్పి చురుగ్గా అతనిమొహం లోకి చూడబోయిన మంజుల, అతను తన వైపు చూడటంలేదని గ్రహించి తలవంచు కుని కూర్చుంది చికాగ్గా మునిపంటితో క్రింది పెదవి కొరుక్కుంటూ.

"మీరు అదే ఆలోచిస్తూ కూర్చు న్నందువల్ల లాభం ఏమీలేదు. ఇలాంటి వాటిని మరిచిపోవడానికే ప్రయత్నించాలి. ఇంకేదయినా మాట్లాడండి." ఇద్దరిమధ్యా కొద్ది క్షణాలు అల్లుకుపోయిన నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ కొద్దిగా తలప్రక్కకి తిప్పి అన్నాడు హరీష్.

"ఇక్కడ కొంచెం ఆపండి. నేను దిగి రిక్షాలో వెళ్ళిపోతాను."

"అదేం? మీ మామయ్యగారిని చూడ టానికి నే నెలాగూ రావాలిగా" అని ఏోసారి ముఖం తిరిగి పరీక్షగా మంజులని చూశాడు. హిందికగా కట్టుకున్న క్రేప్‌సిల్కుచీరలో, తలలో పెట్టుకున్న పూలతో చూడ ముచ్చటగా కుదురుగా కూర్చుంది గడ్డంక్రింద చేయి ఆన్చుకుని. తాంబూలం వేసుకున్న ఎఱ్ఱని పెదవులుచూస్తూ, "పార్టీకి వెళ్ళివస్తు న్నారా?" అన్నాడు సంభాషణ కోసం మార్చా లని.

"పార్టీకికాదు. పెళ్ళి చూపులకి."

ఆశ్చర్యంగా చూశాడు హరీష్.

# అర్ధాంగి

అప్పటికి చేసిన పొరబాటు గుర్తువచ్చి తనలో తనే నవ్వుకుంది పాలిక కొరుక్కుం క్కుంటూ.

"మా సరళని చూసుకోడానికి పెళ్ళి వారు వచ్చారు ఇవాళ. ఆ పెళ్ళి కొడుకుని మేం అందరంకూడ చూసి పాస్ చెయ్యాలని ఫ్రెండ్సంతా బయలుదేరాం. అక్కడి తతంగం పూర్తయ్యేసరికి ఆలశ్యం అయి పోయింది. దీపాలు పెట్టేవేళ్ళకి ఖంగారు పడుతూ లేచి ఎవరిదారిన వాళ్ళం బయలు దేరాం. నాతో వచ్చిన యిద్దరూ వాళ్ళ బస్సు రావడంతో వెళ్ళిపోయారు. బిక్కు బిక్కుమంటూ నే నొక్కదాన్ని మిగిలాను. ఈ వెధవ రోడ్డుమీద కాస్త చీకటి పడే సరికే మనుష్యసంచారం ఉండదు. బస్సు ఎంతకీ రాలేదు. పోనీ రిక్షాలో వెళ్ళిపోదా మంటే కనుచూపుమేరలో ఎక్కడా ఒక్క రిక్షాకూడాలేదు. అసలే చికాగ్గావున్న నన్ను ఇంకా బాధపెట్టి ఏడిపించడానికి ఆ నలు గురు తని వెధవలూ తయారయారు. ఇందా కటినుండి ఒకటే వికవికలూ పకపకలూనూ. నేను కట్టుకున్న చీర దగ్గరనుండి నిల బడిన తీరుదాకా వర్ణించేశారు. చౌరస్తాదాకా నడిచివెళ్ళి తీసుకుందామనుకున్నాను. అంత దూరం నడిచివెళ్ళేలోపుని, ఇందాకటినుండి కాచుకోనున్న బస్సే వస్తుందేమో. అనవ సరంగా దాన్ని పోగొట్టుకోడం ఎందుకని పించింది. ఎటూ తేల్చుకోలేక, ఏమీ చెయ్యలేక భయంతో బిగుసుకుపోయానను కోండి. ఇవాళ నేను లేచినవేళ చాలామంచిది. కరెక్ట్‌గా సమయానికి వచ్చారు మీరు...

అయినా ఆడది వీధిలోకి వస్తే మృగాన్ని చూసినట్లు చూసే ఈ పరిస్థితి అసలు ఎప్పటికి మారుతుం దనిపిస్తోంది.

కాలేజీలలో కలిసి చదువుకుంటు న్నారు. ఆఫీసులలో కలిసి ఉద్యోగాలు చేస్తు న్నారు. రైళ్ళలో, బస్సులలో కలిసిప్రయా ణాలు చేస్తున్నారు. పదిమందిలోవున్నప్పుడు మర్యాద సంస్కారాలకి తలవంచగలిగిన బుద్ధి, ఒంటరిగా అమ్మాయి కనిపించేసరికి ఎందుకు వెర్రితలలు వేస్తుందో అర్థం కావటంలేదు. ఏోవిధమైన ఆవేశంతో చెప్పుకుపోయింది మంజుల.

"దానికి బాధ్యత కేవలం మగవాళ్ళదే అంటే నేను అంగీకరించలేను.... అదుగో అప్పుడే మీకు కోపం వస్తున్నట్లుంది. నేను మీ విషయంకాదు చెప్తూంట. నాగరికత ప్రబలినకొద్దీ అమ్మాయిల వేషధారణ అలం కరణ వెర్రితలలు వేస్తున్న సంగతి మీరూ ఒప్పుకుంటారనుకుంటాను. అలాంటి వింతలు చూసినప్పుడు కొంతమంది బుద్ధి కూడ వక్రించడం సహజం. అయినా ఆ అల వాటుని తప్పించుకోలేక మర్యాదస్తుల విష యంలోకూడ వాళ్ళు అలాగే ప్రవర్తిస్తూం టారు."

"అదీ నిజమే. వింత వ్యామోహంలో పడి లిగాప్పుడే నలుగురిఎల్ల మర్యాదగా తిరిగే పదిమందీ తలఎత్తుకోలేని పరిస్థితివచ్చింది" అనుకుంటూ.

"అధునాతనంగా అలంకరించుకునే వారంటే మంచి అభిప్రాయం లేనట్లుందే మీకు" అంది చిరునవ్వుతో ప్రక్కకి తిరిగి.

హరీష్ వెంటనే ఏం సమాధానం చెప్ప లేదు. "కాస్త చిన్న వయస్సులో వున్నవాళ్ళు చదువుకుంటున్నవాళ్ళే కాకుండా, నలభై ఏళ్ళు పైబడినవాళ్ళు కూడ ఇరవై ఏళ్ళ అమ్మాయిలా అలంకరించుకోవాలనుకోడం ఎంత అసభ్యంగా, హాస్యాస్పదంగాఉంటుందో మీ రాలోచించాలి" అన్నాడు కొద్దిక్షణాల తరువాత.

మంజుల ఏదో చెప్పబోతూండగానే మధ్య లోనే అందుకుని, "ఏదైనా, ఇకనుంచి ఇంత ఆలశ్యం అయినప్పుడు బస్సుకోసం ఆస్టాప్ దగ్గరమాత్రం నిలబడకండి. ఈ సమ యంలో బస్సులన్నీ క్రిక్కిరిసివస్తూం టాయి. అందుచేత కొన్నిచోట్ల అసలు ఆప కుండానే తీసుకుపోతాయి. అందులో ఆ స్టాప్‌లో దిగేవాళ్ళు కూడ ఎవరూ ఉండరు



సాధారణంగా. ఒకవేళ ఒకరూ ఇద్దరూవున్నా స్టాప్ తప్పించి ఏ ఇరవై గజాలదూరం తీసుకుపోయి ఆపుతాడు. మగవాళ్లయితే పరుగెత్తివెళ్లి అందుకోవచ్చుకాని మాలాంటి వాళ్లకి అది సాధ్యంకాదు. అందుకే ఏకంగా రిక్షాలో వెళ్లిపోవడం మంచిది. లేదా అంటే మరో నాలుగడుగులువేసి చౌరస్తా చేరుకున్నారంటే, అక్కడ బస్సు తప్పకుండా దొరుకుతుంది."

"అర లెక్కండయినా, అధమం అరగంటయినా నిలబడందే బస్సుదొరకటం నా అనుభవంలోలేదు. ఏ వారం రోజులకో సరదాగా తిరగడానికి బస్సులకోసం నిలబడాలంటేనే నాకింత విసుగ్గా వుందికదా! రోజూ ఉదయం సాయంత్రం తప్పనిసరిగా బస్సులో ప్రయాణంచేసే ఆఫీసులకి, కాలేజీలకి వెళ్లేవాళ్లపాట్లు భగవంతుడికే తెలియాలి. ప్రజల అవసరాలు గుర్తించి ప్రభుత్వం మరో నాలుగు బస్సులయినా వెయ్యదు. ఆ వున్న నాలుగూ అయినా ఏవో లిమిటెడ్ రూట్స్లోతప్ప అందరికీ అందుబాటులోవున్న ప్రాంతాల్లోనేలేవు. అరమైలు నడిస్తేనేకాని బస్సు స్టాప్ చేరుకోలేని లొకాలిటీస్ బోలెడువున్నాయి ఇక్కడ."

"బస్సులేకాదు. టాక్సీలుకూడ వూరికి సరిపడ అన్నిలేవు."

"నిజమే. రాజధానీనగరంలో రైలు దిగిన మనిషి స్టేషను బైటకువచ్చి రోడ్డుమీద ఒక గంటసేపు నిలబడితేకాని టాక్సీ కంటికి కనిపించదు. ఒకవేళ ఒకటి అరా కనిపించినా, ఆ డ్రైవరు ఏదో సాకు చెప్పి తప్పించుకుని వెళ్లిపోతాడు."

"ఇంక ఈ వూరికివున్న సదుపాయం ఒక్కటే. ఇక్కడి రిక్షావాళ్లు పాపం ఎంత దూరం అయినా పదిమందినైనా ఎక్కించుకోడానికి సిద్ధపడతారు. అంతగా మనకి మొహమాటంగావుంటే మనమొహాలు కనిపించకుండా వో పరదాకూడ కట్టేస్తాడు."

"ఈ వూరుని గురించి ఏమిటో వూహించుకుంటూ వచ్చినవాళ్లుమాత్రం చాల నిరుత్సాహపడతారు. మామయ్యకి ఇక్కడికి ట్రాన్స్ఫర్ అయిందని తెలియగానే నేనెంతో సంబరపడ్డాను. మన రాజధానీనగరం, ఆంధ్రులపాలిటి భాగ్య నగరం చూడబోతున్నానని సరదా పడ్డాను. కాని ఇక్కడికి వచ్చిచూస్తే ఏముంది? ప్రత్యేక రాష్ట్రం వచ్చి ఇన్ని సంవత్సరాలైనా ఇంకా ఇరుకు వీధులు, మురికిపేటలు, నడిరోడ్డుమీదతవ్వి వదిలేసిన డ్రైనేజ్ కాలువలు......ప్చ్..... మనవాళ్లు చేయాల్సింది ఎంతో వుందనిపిస్తుంది. ఎవ్వరూ ఎందుకు పట్టించుకోవటం లేదో అర్ధం కావటంలేదు."

ఎవరూ పట్టించుకోక పోవటంకాదు. చేయాల్సిందేమిటో అందరికీ తెలుసు. ఈ అభివృద్ధి పథకాలు ఎవరి ఆధ్వర్యంలో సాధిస్తే వాళ్లకి పేరు ప్రఖ్యాతులు వచ్చేస్తాయని, వాళ్లు ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా ఉండిపోతారని మిగతా పెద్దలందరికీ భయం. అందుకే అలాంటివి కార్యరూపంలోకి రాకుండా చూస్తారు."

"నిజమే." అని ఒప్పుకుని మరి మాట్లాడ్డానికేం లేనట్లు మౌనంగా కూర్చుంది మంజుల.

"ఇంతకీ ఆ పెళ్లిచూపులు ఎలా ముగిశాయి?" ఎదురుగా రెడ్ లైటు చూసి కారాపుతూ అడిగాడు హరీష్.

"ఏమో మాకేం నచ్చలేదు. ఒప్పుకోవద్దని మా సరళకి చెప్పేశాం." కళ్లు తిప్పుతూ సగర్వంగా అంది.

"ఏం? ఎందుకు నచ్చలేదు." నవ్వాపుకుంటూ అడిగాడు.

"ఆ అబ్బాయి వచ్చే నెలలో అమెరికా వెడతాట్ట. ఈ నెలలో పెళ్లి చేసుకుని ఆ భార్యనికూడ వెంట తీసుకుపోయే ఉద్దేశ్యంతో అలాంటి అమ్మాయికోసం చూస్తున్నాడన్నమాట అంటే, ఈ సంబంధం చేసుకుంటే మా సరళ ఈ సంవత్సరం పరీక్షలకు కూర్చునే అవకాశం ఉండదు. ఒక్క అయిదారు నెలలో పూర్తయిపోయేది, ఈ పెళ్లివల్ల ఇన్నాళ్లూ చదివిన చదువంతా ఎందుకూ కాకుండాపోతుంది అందుకే ఈ పెళ్లి తప్పిపోతే మరో తొంభైమంది పెళ్లికొడుకులు దొరుకుతారుకాని, ఇప్పుడుకాని చదువు మానేశావంటే జన్మలో నీకు మళ్లీ ఇలాంటి అవకాశంరాదు అని దానికి గట్టిగా చెప్పాం. అయినా, 'ఇది వదులుకుంటే మళ్లీ ఇంత మంచి సంబంధం దొరకదు' అనుకునేంత గొప్పతనం కూడ ఏమీ కనిపించలేదు. అసలు ఆ పెళ్లికొడుకుని చూడగానే మా కెవరికీ మంచి అభిప్రాయం కలగలేదు. మన దేశం మొత్తంమీద తనొక్కడే అమెరికా వెళ్తున్నంత డాబు దర్పం ప్రదర్శించాడు. ఈ రోజులలో అమెరికా వెళ్లడం ఏమంత గొప్ప చెప్పండి? మా ఇంటిప్రక్క పురాణం చెప్పే పప్పుశాస్త్రి కూడా ఎలాగో వీళ్లని వాళ్లని పట్టుకొని ఈమధ్యే అమెరికా వెళ్లివచ్చాడు.....నవ్వడం కాదు. నిజం.......ఇంక ఆతని తల్లికూడ అలాంటి సంస్కారం కలిగిందే. పొట్టిగా లావుగా గుమ్మటంలావున్న ఆవిడ చూడ్డానికే గమ్మత్తుగావుంది. ఆవిడ మాట్లాడుతుంటే వినాలనిపించినా పరాయివాళ్ళం మేమంతా చుట్టూ మూగితే బాగుండదని గదిలోంచి తొంగిచూడడం మొదలుపెట్టాం. ఇంతలో సరళా వాళ్లమ్మ కాఫీల ప్రయత్నం చేయడానికి లోపలికివెళ్తూ మమ్మల్ని కాస్సేపు ఆవిడ దగ్గర కూర్చోమంది.

తన కొడుకు ఒక్కడే డాక్టరయినట్లు గొప్పలు చెప్పుకుని మురిసిపోయిందావిడ. అతని తెలివి తేటలూ మంచి గుణాలూ అభిరుచులూ ఒకటేమిటి అతనిలో ఆవిడకి కనుపించని ప్రత్యేకతలేదు. సరే కాకిపిల్ల కాకికి ముద్దనుకోండి...ఆవిడ ఇంకో విషయం కూడ చెప్పింది. తనకి అసలు చదువుకున్న ఆడపిల్లలంటే సదభిప్రాయంలేదుట. చదువురాని అమ్మాయి అయితే అమెరికాలో కొడుకు ఏం ఇబ్బంది పడతాడోనని ఈ సంబంధానికి ఒప్పుకుందిటకాని తనకిమాత్రం ఇంత చదువుకున్న అమ్మాయి కోడలుగా రావడం ఎంతమాత్రం ఇష్టం లేదుట. చదువుకున్న అమ్మాయి మొగుడ్ని లెక్కచెయ్యదుట. అత్తమామలంటే గౌరవం అసలే ఉండదుట ..... అంత నిర్మొహమాటంగా మా మొహంమీదే అలాంటి మాటలంటున్న ఆవిడకి ఎలా సమాధానం చెప్పాలో ....."

కామాలు, ఫుల్‌స్టాప్‌లూ లేకుండా చెప్పుకుపోతున్న మంజుల హరీష్ కారుపార్కుచేసి ప్రక్కకి తిప్పగానే ఉలిక్కిపడ్డట్లయి, "ఇదేమిటి? ఇటుతిప్పారు" అంటూ కెవ్వుమన్నంత పని చేసింది.

"భయపడకండి. డిస్పెన్సరీకి వెళ్లి ఒక్క పది నిముషాలలో అక్కడి పేషెంట్సుని చూసేసింతరువాత మీ యింటి దగ్గర దిగబెడతాను. నేను విజిట్సు అన్నీ పూర్తిచేసుకు వచ్చేదాకా వాళ్లు వెయిట్ చేస్తూ కూర్చోడం బాగుండదు......ఏం మాట్లాడరు? ...... అంతసేపూ మిమ్మల్ని కూడా ఆ రోగుల్ని చూస్తూ కూర్చోమంటానేమోనని భయం అక్కర్లేదు. నేను పని చూసుకు వచ్చేదాకా మీరు మా అమ్మ దగ్గర ఉందురుగాని. ఆవిడతో ఒక్క నిముషం మాట్లాడితేచాలు మీ చికాకు, కోపం అన్నీ ఎగిరిపోతాయి" అంటూ సమాధానంకోసం మంజులవైపుతిరిగాడు.

అలా తొందరపడినందుకు సిగ్గుపడుతూ తలవంచుకుని కూర్చున్న మంజుల సరే అన్నట్లు తల వూపింది.

(సశేషం)

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కారునులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥



# వారఫలం

**29-7-1966 శుక్రవారం మొదలు 4-8-1966 గురువారం వరకు.**

**మేషం :** వృత్తివ్యాపారాల్లో యిదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభించగలవు ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది బంధుమిత్రులను కల్సుకొంటారు

**వృషభం :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో అననుకూల పరిస్థితులు యేర్పడి వారాంతానికి సర్దుకొంటాయి, ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి.

**మిధునం :** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా దానికి తగిన ప్రతిఫలం లభించగలదు ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడంతగదు, ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహించవలసివస్తుంది దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:** ఏ వ్యవహారంలోను ఆరంభంలో అనుకూలత ఆఖరువరకు నిలవదు. ఆకారణంగా పోటి వారితో భేదాభిప్రాయాలు రావచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ఆరోగ్యం బాగా ఉన్నా, ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో అధికవ్యయంజరగడంవలన ఆర్థికంగాఒత్తిడివస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభించగలదు. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలించడంవలన ఆదాయంతోపాటు అంతస్తుకూడా పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. శుభ కార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల కేవలం తాత్కాలికమైన లాభమేకాకుండా మున్ముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి అనుకూలవార్తలనువింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం :** మీరు ఎంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది రావలసిన డబ్బు సమయానికి అందుతుంది సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం బాగాఉంటుంది

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో పోటీదారితో పోటీ పెరగడంవలన మీ కార్యక్రమాలు మార్చుకోవలసి వస్తుంది. ఆర్థికవ్యవహారాలు బాగాఉంటాయి. నూతన వ్యాపారాలు శ్రమమీద ఫలిస్తాయి. కుటుంబ సంతోషంలభిస్తుంది మిత్రులకు సహాయంచేస్తారు.

స్త్రీలకు—సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అలంకార వస్తువులు కొంటారు.

**మకరం :** సామాన్యమైన పనులకుకూడా విశేషమైన ప్రయత్నం చేయవలసివస్తుంది వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు వారాంతంలో ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. సంతోషకరమైన వార్తలనువింటారు.

**కుంభం :** ఈవారంశుభాశుభమిశ్రమంగావుంటుంది. భాగస్వాములతో కలిపిచేసే వ్యాపారాల్లో మాటపట్టింపులు ఉండవచ్చును. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం :** ఆదాయం మాట యెలాగఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు శ్రమమీద నెరవేరుతాయి. ప్రయాణాలు ఫలించగలవు. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి.

—మహేష్

# ఆషాఢస్య ప్రథమదివసే.....

సింగరాజు రామచంద్రమూర్తి



బస్సు దిగిన రమణమూర్తి టైము చూసుకున్నాడు. ఎనిమిదిన్నర అయింది. తను ఏర్పాటు చేసిన టైముకి ఇంకా అరగంట వ్యవధి ఉండడం వలన హోటల్ కేసి నడిచాడు.

"తను ఖచ్చితంగా తొమ్మిదికల్లా ఫలానా చోట ఉంటానని అక్కడకు ఆవేళకి తప్పకుండా రావలసిందని" రాశాడు వసుంధరకి. తనకున్న టైమ్ సెన్స్ విషయం బంధువులందరికీ తెలుసు. అందుకే మామయ్య సరదాగా "వాడు ఫిలియాస్ ఫాగ్ లాంటివాడే!" అంటుంటే తనకి ఆనందం కూడా.

కాబట్టి వసుంధర ఆ వేళకి అక్కడికి రావడం ఖాయం. తను అంతకు ఒక్క నిముషం ముందుగానే అక్కడకు చేరుకోవడం అంతకన్న ఖాయం. తామిద్దరూ కలిసి ఈరోజు సరదాగా గడపడమన్నది బోలెడు ఖాయం!.... హుషారుగా ఈలేసుకుంటూ హోటలులోకి వెళ్ళి ఒకమూల కూర్చుని సర్వరుకి కావలసినవి చెప్పాడు. మళ్ళీ తను తన ఆలోచనల్లోకి జారిపోయాడు.

ఒక్క వారంరోజులు శలవు రావడంవలన ఎన్నో కలలతో ఇంటికి వచ్చిన తనకి అమ్మ చెప్పిన వార్త పిడుగుపాటులా తోచింది.

"మావయ్య ఉత్తరం రాశాడురా రేపు ఆదివారం మంచి ఆషాఢ మాసంట. కొత్తల్లుడు, అత్తగారు ఒక గడప దాటకూడదు అవటా" అని అంది మాటవరసకి చెప్పినట్లు ఆ పైది ఊహించుకోవడం నీ వంతు అన్నట్లు.

తనకి ఒళ్ళుమండిపోయింది. ఈకాలంలో కూడా ఇంకా ఇటువంటి పట్టింపులేమిటని? పూర్వం అయితే పెళ్ళి చేసుకున్న వాడికి వేరే ఏమంత పనుండేది కాదు కాబట్టి ఇంటి చుట్టూ తిరుగుతాడని కొన్నాళ్ళు ఎడబాటు కలగజేసి ఆ ముచ్చట చూద్దామని ఏర్పాటు చేసిన ఆచారం ఇది. ఇప్పుడో?

ఆ మాటే అనేశాడు. "నాకు అటువంటి వాటిలో నమ్మకంలేదు. చదువుకున్న వాళ్ళం. మనకి కూడా ఈ ఆచారాలేమిటి?" అని.

అందుకావిడ "నీకు లేకపోవచ్చు. పెద్ద వాళ్ళం మేం బ్రతికున్నన్నాళ్ళూ ఇటువంటి ముచ్చట్లు ఉంటుంటాయి. పెద్దవాళ్ళు ఎందుకు పెట్టారో మనకేం తెలుసు?" అంది.

తనకి నవ్వు వచ్చింది. కేవలం పెద్దవాళ్ళు పెట్టిన వాటి మీది గౌరవం కొద్దీ కన్నా భయం కొద్దీ ఆచరించే వాళ్ళని చూస్తే తనకి జాలి. కాని అమ్మతో మాత్రం ఇంక ఆ విషయం మీద చర్చ పెంచితే ఆవిడేమంటుందో తనకి తెలుసు.

పెళ్ళయిన వారానికల్లా ట్రయినింగ్ కోసం వెళ్ళిపోయిన తను ఇన్నిరోజులవగా ఈ శలవు కోసం ఎంతగా ఎదురు చూస్తున్నదీ వీళ్ళకెలా తెలుస్తుంది? మళ్ళీ ఈ అవకాశం పోతే ఇంకా ఎన్నాళ్ళు వేచి ఉండాలో!

తను చదువుకున్నవాడు. వసుంధర చదువుకుంటున్నది. తను చేయవలసిందేదో చేసుకుపోవాలి. వెంటనే కార్యరంగంలోకి దిగాడు. వసుంధరకి ఉత్తరం రాశాడు తన ప్లాను గురించి. స్నేహితుడు వినాయకరావుకి రాశాడు చేయవలసిన సహాయం గురించి. శనివారం అతను వచ్చినప్పుడు కలుసుకున్నాడు. అంతా సవ్యంగా అనుకున్నట్లు జరిగిపోవడం తనకి ఆనందాన్ని కలిగించింది.

అయితే తరువాత "ఇటూ అటూ ఉన్న పెద్దలకి తెలుస్తే అన్న" సందేహం కలిగింది. "తెలుస్తే మాత్రం కొంపలంటుకుపోయిందేముంది? అదీ నేనూ భార్యాభర్తలం కామని ఎవరయినా అనగలరా? ఈనాడు కావడమే కాదు. చాలాకాలంగా, ఇంచుమించు నను పుట్టినప్పటి నుంచీ తన భార్యగా వ్యవహరింపబడింది. పెళ్ళయాక కూడా "కొన్నాళ్ళు ఆగడం మన సంప్రదాయం

అని వాళ్ళు అన్నారు కాబట్టి సరిపోయింది కాని....."

నవ్వొచ్చింది రమణమూర్తికి.

తక్కున పెట్టిన ప్లేటు చప్పుడుతో ఊహల్లోంచి కిందికి దిగాడు.

హోటలు బయటికి వచ్చాక టైము చూసుకున్నాడు. తను అనుకున్న దానికి ఇంకా అయిదు నిముషాలుంది. సిగరెట్టు ముట్టించి బయలుదేరాడు.

అతను ఆగిన వెంటనే అతని ముందు రిక్షా వచ్చి ఆగింది. అందులోంచి వసుంధర ముందుకు వంగి "వచ్చాను" అంది నవ్వుతూ.

"చాలా పంక్చువల్‌గా వచ్చావే"

"అవునుమరి. మీకున్న బిరుదం తెలియని దాన్ని కానుగా!"

"దట్స్ గుడ్! మరొకటి ఉంది చెప్పవలసింది. అనవసరంగా సిగ్గుపడకూడదు. మొగ్గలా ముడుచుకుపోతే ఇప్పుడే బస్సెక్కేస్తాను."

"అలాగే"

ఆమె జరిగి చేసిన చోటులో కూర్చున్నాడు రమణమూర్తి. రిక్షా పూలపల్లకీలా కదిలింది.

"ఎక్కడికిట యాత్ర?"

"తెలియదా నీకు? అన్నట్టు నీకా విషయం రాయలేదుగా" అని పెద్దగా రిక్షా అతనితో చెప్పాడు ఎక్కడికి వెళ్ళాలో.

"సినిమా కన్నమాట!"

"అన్నమాటేమిటి—మొగుడు మాట!" అని ఒక్కక్షణం ఆమె వంకచూసి "ఇదివరకెక్కడవో చదివిన గుర్తు. ఒక సినిమా తార ఫోటో కింద 'దిగినాను దిగినాను దివి నుండి భువికి' అని రాశాడు" అన్నాడు నవ్వుతూ.

"మెచ్చుకున్నాం గాని ఈ కార్యక్రమం ఏమిటి, ఇలా దొంగచాటుగా మనం తిరగడమేమిటి?"

"పెద్దవాళ్ళ మీద యువతరం చేస్తున్న తిరుగుబాటు! ఆచారాల్ని నేనూ గౌరవిస్తాను. కాని వాటికి అర్థం ఉందా లేదా అని ఆలోచించాలి..సరేగాని ఇప్పుడీ రిక్షా అబ్బాయికి నేనెవరినో తెలుసా?"

ఫకాలున నవ్వింది వసుంధర.

"అంత తిరుగుబాటు చేసే యువకులకి ఇంత భయం కూడదు."

"ఏడిశావు లేవోయ్. నా ఉద్దేశ్యం అది కాదు. ఎవడో పరాయి మగాడితో తిరుగుతోంది ఈ అమ్మాయి అనుకుంటే....."

"అందుకని ఏం చేస్తారుట?"

"చెబుతాను అతనికి. 'ఈ అమ్మడు సాక్షాత్తూ నా భార్య. ఏదో కాసేపు సరదాగా వెంటేసుకు తిరుగుదామని వచ్చాను. పెద్దవాళ్ళు రాక్షసుల్లా ఉంటే వాళ్ళని తప్పించుకుందుకు చాటుగా అఘోరిస్తున్నాము' అని చెప్పనా?"

"సంతోషించాము కాని అతనికి మీరెవరో తెలుసు. మా నాన్నగారికి స్టేటు రిక్షా వాడు. కాబట్టి మీరు రౌడీలని అనుకోడు వరా!"

"మంచి ముందు చూపు ఉంది సుమీ నీకు! ఇంట్లో ఏమని చెప్పి వచ్చావు?"

"మా ఫ్రెండు ఇంటికి వెడుతున్నానని, సాయంత్రం దాకా వాళ్ళ ఇంట్లో నలుగురం కలిసి ఆడుకుంటామని!"

"ఆ ముగ్గురూ మీ ఇంటికి రావాలిట ఇవ్వాళ!"

"అప్పుడుమాత్రం భయం ఏమిటి? పరాయి వాళ్ళతో గాని ఊరేగుతున్నానా?"

"నిన్ను 'లా' చదివిస్తానుగాని అమ్మడూ ఇక బుర్ర పాడుచేసుకోకు. ఇదే వేంచేసేము సినిమా హాలు"

సినిమాలో కూర్చున్నామన్న మాటేగాని అందులోని ఒక్కమాట వినడంలేదు. ఒక్క బొమ్మ చూడడంలేదు రమణమూర్తి. తను పెళ్ళయిన తరువాత ఈ నెలరోజులుగా ఎంతగా ఈ ఎడబాటును గురించి తపించిపోతున్నదీ, ఈ వారంరోజుల శలవు కోసం ఎన్నినాళ్ళుగా ఎదురు చూస్తున్నదీ ఇంటికి రాగానే అమ్మ చెప్పిన ఆషాడమాసం మాట విని తన ఒళ్ళు ఎంతగా మండిపోయిందీ వివరంగా చెబుతున్నాడు.

"ఇదేదో కొత్త గోల, పాపం వాళ్ళ ఉసురు మనకేల తగలనీ" అన్న నీతిమంతులు చుట్టుపక్కల సీట్లు ఖాళీ చేసి బహు దూరపు బాటసారులయి పోయారు. ఆ ఓపిక లేనివాళ్ళు అలానే కూర్చుని సగం సినిమా అయ్యాక లేద్దాంలే అని సరిపెట్టుకున్నారు.

"కూల్ డ్రింక్స్ సార్!" అన్నాడు ఇంటర్వెల్‌లో ఒక కుర్రాడు వచ్చి.

రెండు తీసుకుని ఒకటి వసుంధరకిచ్చి ఒకటి తను తాగి అతనికి డబ్బివ్వపోయాడు.

"అయ్యగారు ఇచ్చేశారు సార్!" అనేశాడు వాడు వినయంగా. ఆశ్చర్యపోయాడు రమణమూర్తి "ఏ అయ్యగారోయ్?"

"మా మానేజరు గారండి!"

"మానేజరు గారా?"

"అవునండి ఈ హాలు మానేజరుగారు!"

రెండవసారి ఆశ్చర్యపడి లేచి "నువ్వు గానీ ఎరుగున్నావా వసూ" అనడిగాడు.

వసుంధర చిరుకోపాన్ని అభినయించి "నేనెరగడ మేమిటి?" అంది విసుగును జోడిస్తూ.

"ఐ మీన్, మీ నాన్నకి ఈయన స్నేహితుడయి ఉండి నన్నెరుగున్నా డేమోనని"

"ఉహూ, నాకు తెలియదు"

"నిన్ను పంపించింది మా దగ్గరకు కాదేమోనయ్యా, డబ్బు పుచ్చుకో!"

"మీ దగ్గరకే నండి మాస్టారూ, నేనే పంపించింది. మీరు నన్నెరగరు కానీండి మీ మావగారు నాకు ఫ్రెండు. మీ పెళ్ళికి కూడా వచ్చాను" అంటూ వచ్చి పక్కన కూర్చున్నాడొక సిల్కు లాల్చీ ఆయన.

కుర్రవాడు చెప్పిన ఆయన ఈయనేనని గ్రహించడం వలన "నమస్కారమండీ, మీ డ్రింక్స్‌కి థాంక్స్!" అన్నాడు మూర్తి.

కాసేపు అతని ఉద్యోగం గురించీ, వాటి గురించీ అడిగి వెడుతూ వెడుతూ "ఉంటారా రెండురోజులు" అన్నాడాయన.

"అహ. శలవు లేదండీ. ఈ రోజే వెళ్ళిపోతాను"

"అలాగా! మీ మావగారిని సాయంత్రం ఒకసారి రమ్మనండి"

ఆయన వెళ్ళిపోయాక "కొంపదీసి ఈ విషయం మీ నాన్నకి చెప్పడు కదా!" అన్నాడు వసుంధరతో.

నవ్వింది వసుంధర.

"భయంకాదు వసూ, బావుండదు"

"తరువాత ఎక్కడికిట" అంది వసుంధర హాలులోంచి బయటకు వచ్చాక.

"ఎందుకు, ఎక్కడికి అని సహధర్మచారిణి అడగకూడదు చిటికిన వేలుచ్చుకుని నడవడమే ధర్మం."

"సరే బాగానే ఉంది. ఇప్పుడు వేలుచ్చుకుని రోడ్లమ్మట నేను నడవలేను బాబూ! రిక్షా కట్టించండి చిటికిన వేలు పుచ్చుకుని కూర్చుంటాను."

"టైము ఒంటి గంటవుతోంది. భోజనం చేయద్దా మరి?"

"చేయద్దా, వెళ్దద్దా అని అడగకూడదు అర్ధాంగిని"

"నవ్వులాట కాదు వసూ. భోజనం చేద్దాం పద!"

హోటల్‌లో 'స్పెషల్' రూంలోకి తీసుకు వెళ్ళాడు. వాళ్ళిద్దరూ తప్పిస్తే అక్కడ మరెవరూ లేకపోవడం వలన సినిమా గురించీ ఉమ్మడి బంధువుల గురించీ, విడివిడిగా వాళ్ళ వాళ్ళ స్నేహితుల గురించీ మాట్లాడు కుంటూ భోజనం చేశారు.

చివరలో రమణమూర్తికి పెద్ద అను మానం కలిగింది. "అవునుగానీ వసూ, నేను మంచి ఆకలి మీద వచ్చాను. కాని మారు పెట్టించుకోకుండా నాకు కడుపు నిండి పోయింది. ఏమిటి? ఎందువలన? తెలిసి చెప్పకపోతే నేను మళ్ళీ చెట్టు ఎక్కి కూర్చుం టాను."

"అయితే వినండి బేతాళరావు గారూ, మీరు తిన్నది ఇంచుమించు రెండు విస్తళ్ల లోని అన్నం. నాకు ఆకలిగా లేనందు వలన వాయి చెల్లగా వాయి మీ విస్తట్లోకి రవాణా చేశాను సర్వారావుగారు లేనపుడు!"

"హారినీ!"

"హాపీసీ అనాలి" సవరించింది.

కిళ్ళీ వేసుకుని సిగరెట్టు ముట్టించి టిక్షా ఎక్కడికి వెళ్ళవలసిందీ చెప్పాడు.

"కాసేపు మా వినాయకరావుగాడి గది అనబడే గుహలో విశ్రాంతి పెళ్ళికూతురుకీ పెళ్ళికొడుక్కీ."

ఖంగారు పడింది వసుంధర.

"ఒద్దు బాబూ, కాసేపు ఇలాగే ఎక్కడయినా తిరుగుదాం."

"సైలెన్స్, మాట్లాడకలా!...ఆ ఇంటి ముందు ఆపవోయ్...ఇంటివాళ్ళతో సంబంధం లేకుండా మనం నేరుగా పైకి వెళ్ళిపోవచ్చు. మంచి వసతిగల గదిలే!"

"అతను లేడా మరి?"

"వాళ్ళ పుట్టింటికి వెళ్ళాడు. ఇంకో నెలలో ఇది ఖాళీ చేసి ఫ్యామిలీ పెట్టు కుంటాడు. రా లోపలికి."

గుమ్మంలోనే నిలబడిపోయింది వసుంధర.

"కమాన్"

"ఊహూ. ఇక్కడ గుమ్మంలో కూర్చుం టాగాని కబుర్లు చెప్పండి"

"సిల్లీ గరల్" అంటూ చేయి పుచ్చు కుని లోపలికి తీసుకు వచ్చి తలుపు వేశాడు. "బుద్ధిమంతురాలిలా చెప్పినట్లు వినాలి. ప్రతి దానికి ప్రతిమాలించుకోకూడదు. చదువు కుంటున్న దానివి సిగ్గుండదనుకున్నాను."

"గది చాలా శుభ్రంగా ఉందే! ఆడవాళ్లు లేకపోయినా ఉన్నట్లే సర్దాడు మీ ఫ్రెండు"

"సర్లే, మనం వస్తామని ఉత్తరం రాస్తే రెండురోజులు పడి సర్ది ఉంటాడు. ఉన్నప్పుడు ఈ గదిలో నేల మీద పడుకున్న మనిషి సాధారణంగా అగపడడు. అంత లోతున ఉంటుంది."

అంతలో తలుపు కొట్టిన చప్పుడవ డంతో ఖంగారుపడి "ఎవరు చెప్మా వచ్చింది" అని ఆశ్చర్యపోయాడు.

"ఇంటివాళ్ళేమో? దొంగలని అనుకు నుంటారు."

"నో, నో. మా వాళ్ళిలా వస్తారని ముందు గానే చెప్పి ఉంచాడు. వాళ్ళని డిస్టర్బ్ చేయద్దని కూడా చెప్పాడుట... చూసెద గాక"

తలుపు తీశాడు.

"నేనే నాయనా ఈ ఇంటిదాన్ని అబ్బాయి చెప్పి వెళ్ళాడనుకో. ఉరికే చూసి పోదామని వచ్చాను."

చూసింది కదా ఇకపోతుంది లెమ్మని గుమ్మంలోనే అడ్డంగా నిలబడ్డాడు రమణ మూర్తి.

"బయట మబ్బులు పడుతున్నాయే కాని వర్షం రాదు. ఈ కాలంలో ఇదొక పెద్ద చావు. హమ్మయ్య" అంటూ కూర్చుని

"పొద్దున్నుంచీ చేస్తుంటే ఇప్పటికి అయింది పని. అన్నట్టు నీ పేరేమిటన్నా వమ్మాయ్?" అంది.

"వసుంధర. నా పేరు రమణమూర్తి" హడావుడిగా చెప్పేశాడు. ఆవిడ ఇలా రావడం బావుండలేదు అతనికి. అందులోనూ కూర్చో వడం బొత్తిగా నచ్చలేదు. పుణ్యకాలం కాస్తా ఈవిడతోనే సరిపోయేట్టుందని అతని భయం.

"బాగున్నారు నాయనా జంట. అన్నట్టు జంట అంటే గుర్తొచ్చింది. మరే ఇది వరకు ఆ ఎదురిల్లు లేదూ—ఆ ఇంట్లో ఒకబ్బాయి అద్దెకొచ్చాడు. పెండ్లయితే గాని ఇచ్చేవాళ్ళు కాదు వాళ్ళు అతనికి పెళ్ళయిందని కాపరానికి రావడానికి ఇంకా కొంచెం ఆలస్యం ఉందని చెప్పి దిగాడు. కొన్నాళ్ళు పోయాక అమ్మాయిని తీసుకొచ్చి 'శలవు లిచ్చారు మామ్మగారూ. దీనికి, నాలుగురోజులు ఊరు చూపిద్దామని తీసు కొచ్చాను.' అన్నాడు.

పాపం ఆ ఇంటావిడ బాగా పెద్దది. సంబరపడిపోయి 'బాగున్నారు నాయనా చిలకా గోరింకల్లా' అని వాళ్ళకి కావలసిన సామానులు అడిగి పుచ్చుకోమని మొహమాట పడద్దనీ మరీమరీ చెప్పింది.

అలా ఒక నాలుగు రోజులున్నాక వెళ్ళి పోయిందా అమ్మాయి. తరువాత కొన్నాళ్ళకి తెలిసింది అసలా అబ్బాయికి పెళ్ళే కాలేదని! అది కూడా ఎలా తెలిసిందనుకున్నారూ? ఒకరోజు ఎవడో స్నేహితుడ్ని తీసుకొచ్చాడు.



రూపు అనుకుందా ఏమన్నానా ఈ ముసలి దానికి, నిజంగానే స్నేహితుడనుకుంది. అయితే ఆ రోజే వాడి ఖర్మకాలి వాడి నాన్న వచ్చాడు. వాళ్లది చాలా దూరంలే విశాఖ పట్టణం పైన.

రావడమే పెద్ద రభస. ఆ స్నేహితుడు ఆడపిల్లట! అది నాయనా వరస. ఏం చెప్ప గలం ఈ రోజుల్లో పిల్లల వేషాలు. వెంటనే ఖాళీ చేయించింది.

మా రోజుల్లో ఇలా పెళ్లాలని వెంటేసుకుని తిరగటానికి భయం. అదివా, ఎక్కడికయినా తప్పనిసరి అయి బయలు దేరినా ఆయన ఒక ఫర్లాంగు ముందు. ఆవిడ ఒక ఫర్లాంగు వెనక ఉండేది. ఈ రోజులే వేరు.. హా..య్..నిద్ర ముంచు కొస్తోంది బాబూ. చల్లటి గాలి వేస్తోందా. అందులోనూ పెద్దతనం!" అంటూనే అలా గుమ్మం దగ్గరే ఒరిగిపోయిందావిడ.

రమణమూర్తికి ఒంటి మీద తేళ్లు జెర్రులు పాకినట్లయింది. అసలు ఈవిడ ఇదంతా ఎందుకు చెప్పినట్టు? తమ మీద నమ్మకం లేకనా? అసలు అవి జరిగాయా లేక కల్పించి చెప్పిందా. నిలదీసి అడుగుదా మనుకున్నాడు. కాని అంతలో స్నేహితుడు రాగానే పెట్టె, పరుపు నెత్తిన పెట్టుకుని వీధిన పడవలసి ఉంటుందని, ఈ పట్టణంలో కొన్ని రోజులపాటు వీధిలోనే ఉంటే తప్ప మళ్లీ కొంప దొరకదని గుర్తు రావడం వలన ఆవేశాన్ని దిగమింగుకున్నాడు.

వెంటనే లేచి నిలబడి "రా వసూ, ఇక్కడ ఇంకొక్క క్షణం కూడా ఉండద్దు" అన్నాడు.

"ముందా మామ్మగారిని లేపండి. పాపం తని కట్టుకుని పైకి వచ్చింది!"

"నే నావిడతో మాట్లాడను."

నవ్వింది వసుంధర.

"బాగుందండీ వరస. నా కావిడ మీద కోపం లేదుగానీ నే లేపుతాలెండి!" అని వెళ్లి ఆవిడని తట్టి "లేవరండి, మేం అలా బజారు వెళ్లి అటునించి ఊరెళ్లిపోతాము. ఇంటికి తాళం వేయాలి!" అంది.

"అయ్యో అప్పుడే వెళ్లిపోతున్నారూ?.. మంచిదమ్మా మా ఇల్లు కూడా ఒకసారి చూసి వెడుదువుగాని రా"

ఆవిడ రాక్షసుల తాలూకు మనిషని, కనుక వెళ్లద్దన్నట్లుగా సాధ్యమయినంత యాక్షన్‌తో తన ఉద్దేశ్యాన్ని వ్యక్తపరిచాడు రమణమూర్తి.

## ఆషాడస్య...

కాని వసుంధర అదేమీ పట్టనట్లుగా "మీరు తాళం వేసి రండి. నేను వాళ్లింటికి వెళ్లివస్తాను..పదండి" అంటూ ఆమె వెంట కిందకు నడిచింది.

చేతిలో పండుతో తిరిగి వచ్చి "బొట్టు నాకు, పండు మీకూనుట!" అని అతని చేతిలో పెట్టింది వసుంధర.

"పారేస్తా"

"తప్పు. పెద్దవాళ్లు బొట్టుపెట్టి ఇచ్చిన దాన్ని పారేయకూడదు. పాపం అక్కడనే నిద్రపోయినందుకు ఆవిడ ఎంతో ఇదయింది.

టైము చూసుకున్నాడు మూడుగంట అవబోతోంది. కాలం పరుగెడుతున్నట్లని పించింది అతనికి. "కాసేపు హాయిగా మాట్లాడుకోనయినా వీల్లేకుండా సోది చెప్పి ఇప్పుడు ఇదయిందిట హు....పద, రిక్షా ఎక్కు."

రిక్షా ఝామ్మంటూ వెళ్లి హోటలు ముందాగింది. కవుంటర్ దగ్గరికెళ్లి గది తీసుకుని అక్కడి పుస్తకంలో సంతకం పెట్టి "రా వసూ పైకి వెడదాం" అన్నాడు. కుర్రాడు దారి చూపించగా ఇద్దరూ పై గదిలోకి వెళ్లారు.

"ముఖం కడుక్కుని వస్తాను బాబూ. ఎండ కొట్టేసింది" అంది వసుంధర లోపల అడుగుపెడుతూనే.

"అదుగోనండి, అది బాత్‌రూం. ఎప్పుడూ నీళ్లు వస్తుంటాయి" అని చూపించాడు కుర్రాడు.

"ఇదుగో కుర్రాడా, నువ్విలోపున కాఫీలు పట్టుకురా!"

కాఫీలతో బాటు ఒకాయన కూడా వచ్చాడు.

"మీరు చెప్పకపోయినా నా కాఫీ కూడా తెప్పించేసుకున్నాను" అని నవ్వి "ఈహోటల్ మాదేలెండి" అన్నాడాయన వస్తూనే.

ఎవరన్నట్లుగా చూశాడు రమణమూర్తి "ఈ హోటల్లో ఇది ఆచారమేమో స్వయంగా పరామర్శించి పోవడం" అని ఆశపడ్డాడు. కాని అతని ఆశ నిరాశయి పోయింది.

"మీ మావయ్య నాకు బెస్టుఫ్రెండు. రోజూ సాయంత్రంపూట వస్తాడు. ఇంకో రెండు పక్షులు కూడా వస్తాయి లెండి ఆ వేళకి. రెండాటలు వేస్తాం. నలుగురం కలిసి యూనివర్శిటీలో చదువుకున్నాం. వాళ్లు ముగ్గురూ ఉద్యోగాలు వెలిగిస్తున్నారు. నన్నీ హోటలు ఉద్ధరించమని పోయాడు మా నాన్న. అదీ విషయం. అమ్మాయీ, మీరూ వస్తూంటే లోపలన్నాను లెండి నేను...ఏమ్మా కులాసానా? ఏమిటీ ఇటొచ్చారు? అల్లుడుగారికి మన హోటలు చూపిద్దామని తీసుకొచ్చావా?"

రమణమూర్తికి కోప వచ్చేసింది.

"అవును బాబాయిగారూ. ఆయనే ఈ ఊళ్లో మంచి హోటలు రూంలో దిగాలని ఉందని చాలావాళ్లుగా ముచ్చటపడుతున్నారు. ఇక్కడయితే పైన ఖర్చులేదని.."

నవ్వుకున్నారు ఇద్దరూ. వాళ్ల నవ్వు విని నవ్వుదామని వ్యర్థప్రయత్నం చేశాడు రమణమూర్తి.

"మీరు కూడా ముఖం కడుక్కురండి. నా ప్రాణం ఇప్పుడు హాయిగా ఉంది" అంది వసుంధర.

"అక్కరలేదు."

"దట్సాల్ రైట్. ముందీ కాఫీ తాగండి. కొంచెం సేపట్లో స్పెషల్ టిఫిన్ చెప్పి వచ్చాను. అది వస్తుంది. డ్రింక్స్! అదీ మా ఆతిథ్యం. అంతవరకు ఏమయినా సరదాగా కబుర్లు చెప్పండి. మీ ట్రెయినింగ్ విషయాలు. అసలు మా వాడు మీరూ వస్తున్నట్టు మాట మాత్రం చెప్పలేదే!"

"అల్లుడొస్తున్నాడని దిగులు కాబోలు"

రమణమూర్తి ఏమీ మాట్లాడకపోవడంతో ఆయనే ■ అవకాశాన్ని వినియోగించుకోదలచి తన కాలేజీ జీవితం, అప్పటికీ ఇప్పటికి చదువులు ఎంతగా దిగజారిపోయిందీ, యూనివర్శిటీ హాస్టలు జీవితం వగయిరాల మీద అనర్గళంగా మాట్లాడేశాడు.

"మావాడికి సీటు కోసం మొన్న వెళ్లాను. యూనివర్శిటీ ఎంతగా మారిపోయిందనుకున్నారు. బోలెడు కొత్త బిల్డింగ్స్ కట్టారు. మీ మావగారితో ఆ మాటంటే అంటాడూ "మనం చేసిన ఫూలిష్‌థింగ్ అదేరా! అక్కడనే సెటిల్ అయిపోవలసింది. ఆ వాతావరణంలోనే ఇన్స్పిరేషన్ ఉంటుంది. మనం బాగుపడాలన్నా, ఇంకొకళ్లని బాగు చేయాలన్నా అది ఉపయోగపడుతుంది" అని.. ఎప్పుడూ వాడికి అదే యావ. ఇక్కడ మాత్రం వాడికేం తక్కువ చెప్పండి. నాలుగు చేతులు చాలవు సంపాదనకి. ఇందులో తృప్తి లేదుట!"

అంతలో ట్రేలో టిఫిన్లు, కాఫీలు

తెచ్చాడు కుర్రాడు.

"అమ్మాయ్, అది అల్లుడుగారి కివ్వు. అది టేస్టు చేయండి. ఆ డిష్‌కి మన హోటల్ పెట్టింది పేరు."

మాట్లాడకుండా తినేసి "బావుంది, చాలా బావుంది. బోలెడు బావుంది!" అన్నాడు రమణమూర్తి.

అతన్ని చూసి ఫక్కున నవ్వింది వసుంధర.

"ఏం ఎందుకు నవ్వుతావూ? నీకు బాగా లేదా? రియల్లీ, నాకు చాలా బావుంది మాస్టారూ! దాని నవ్వుకేం లెండి కోతి"

"కోతి అంటే గుర్తుకొచ్చింది. చిన్నప్పుడు మేం నలుగురం కలిసి మహాకోతి పనులు చేసే వాళ్లం. మీ వాళ్లింటికి వెనక పక్క ఒక మామిడి తోట ఉండేది ఎవరిదో. వేసవికాలం వచ్చిందంటే అందులో కాయలు దొంగతనంగా కోయడం పెద్ద సరదా మాకు. మీకు అనుభవం ఉందో లేదో గాని కొన్న కాయలు వాటంత రుచి ఉండవు.

ఒకసారి మమ్మల్ని పట్టుకున్నాడు తోట

వాడు. నాలుగు కొడితే బావుండేది. కాని రాస్కెల్, ఇంటికి తీసుకెళ్ళి మీ తాతయ్యకి అప్పచెప్పాడు. ఆయన అసలే నిప్పు. పోనీ ఆయనయినా కొడితే బావుండేది. అలా చేయ లేదు. మిగిలిన వాళ్ళనిద్దరినీ వదిలేశాడు. పెద్దగా ఎరక్కపోవడం వలన నన్ను మీ మావ య్యని చెట్లుకి కట్టేసి ఇంతింత కారం స్వయంగా కళ్ళల్లో పెట్టి "జీవితంలో మళ్ళీ దొంగతనం చేయకండి" అన్నాడు.

నిజంగానే చేయలేదు మళ్ళీ. మామిడి కాయలు చూస్తే ఆయనే గుర్తుకొస్తాడు. అన్నట్టు నాలుగయింది. మీ మావగారు వచ్చే వేళయింది. కూర్చునుండండి. ఒక్క సారి కిందకు వెళ్ళి వాడు రాగానే వెంట బెట్టుకు వస్తాను. ఒక్క పది నిమిషాల్లో వచ్చేస్తాడు" అని వెళ్ళిపోయాడు ఆయన.

"వాన వెలిసింది! వసుంధరా ఇకలే పోదాం" అన్నాడు నీరసంగా రమణమూర్తి.

"కాసేపుండండి. నాన్నగారు వస్తారటగా" నవ్వుతూ అంది.

"సర్లే ఇక నదొక్కటే తక్కువ. మీ నాన్నకి ఈ ఊళ్లో ఇంత పరపతి ఉండడం బాధగానే ఉంది సుమీ...అయినా ప్రతిచోట కనీసం మనం మాట్లాడుకునేందుకయినా వీల్లేకుండా ఎవరో ఒకళ్ళు అడ్డం పడ్డారు.. ఇదంతా నాకేదో కొంచెం విచిత్రంగా ఉంది!"

"సర్లెండి, ఇప్పుడెక్కడికిట ప్రయాణం"

"ఇక నేను పూర్తిగా ఓడిపోయాను. నీ ఇష్టం"

# ఆషాఢస్యా...

"అలా బుద్ధిమంతుల్లా ఉండాలి. ముందు పుణ్యం అన్నారు పెద్దలు. పదండి"

ఎక్కడికి అని అతను అడగలేదు. ఇద్దరూ కలిసి బయటికి వచ్చి గబగబ రిక్షా లోకి ఎక్కేశారు.

"దుర్గగుడికి పోనీయ్" అంది వసుంధర..

"చూడండి ఇక్కడి నుంచి ఎంత అం దంగా అగపడుతుందో ఊరు. చిన్నప్పటినుంచీ నాకిది సరదా. ఇలా ఆకాశం అంత ఎత్తు మనం అయి ఆ ఇళ్ళు, చీమల్లా నడిచే మను ష్యులని చూస్తుంటే ఎంచక్కా ఉంటుం దనీ!" తన్మయత్వంతో కిందకు చూస్తు అంది.

పైన నల్లగా మబ్బులు కమ్ముకుంటూనే ఉన్నాయి. కాకపోతే వర్షం కురవడానికి ఏర్పాట్లు చేస్తున్నట్లుగా చల్లటి గాలి వీస్తోంది. ఆ గాలికి ఎగురుతున్న ముంగురులు ఆమె నుదుటి మీద నాట్యం చేస్తుంటే తన్మయుడయి పోయాడు రమణమూర్తి.

"అవును ఇక్కడ చాలా బావుంది" అన్నాడు మెల్లిగా.

"వర్షం రాబోతోందని కింద రోడ్ల మీద చూడండి ఎంత హడావుడిగా వెడు తున్నారో?... రండి అమ్మవారి దర్శనం చేసుకుందాం."

పూజ చేయించాక "ఒక్కసారి మీ పర్స్ ఇవ్వండి" అంది వసుంధర.

"ఎందుకు?"

"తిరిగేప్పుడు 'ఎక్కడికి' అని భార్య అడక్కూడదు. ఇటువంటి స్థలాల్లో 'ఎం దుకు' అని భర్త అడక్కూడదు"

"అబ్బ"

నవ్వుతూ పర్స్ ఆమె చేతికిచ్చాడు. అందు లోంచి కొంత లెక్కపెట్టి తీసి హుండీలో వేసి నమస్కరించింది వసుంధర.

వింతగా చూస్తున్న రమణమూర్తితో "మన పెళ్ళయినందుకు అమ్మవారికి ఇస్తా నన్న లంచం" అంది నవ్వుతూ.

ఆమె ముఖంలోకి చూసి చేయి పుచ్చు కుని మెల్లగా బయటికి తీసుకొచ్చాడు. ఎదురుగా ఉన్న మనిషిని చూసి ఆశ్చర్య పోయాడు.

తండ్రిని చూడ్డంతోనే రమణమూర్తి చేయి వదిలి వెడంగా నిలబడింది వసుంధర.

"ఊళ్లో విహారంపూర్తి అయిందా మళ్ళీ ఇంకో సినిమాకి వెళ్ళాలా? నేనెరుగున్నది ఒక్క సినిమాహాలు మానేజరునే! పైగా ఇక తిరగలేను కూడా!"

సిగ్గుపడ్డాడు రమణమూర్తి.

కొండ దిగాక "ఇంటికి వెడదాం పద" అన్నాడాయన.

"వద్దులే నేను ఊరు వెళ్ళిపోవాలి. మళ్ళీ ఎప్పుడయినా వస్తాలే!"

బస్సు బయలుదేరబోతుండగా "ఈ వెళ్ళ వంగానే నాన్నగారికి ఉత్తరం రాస్తాను" అన్నాడాయన.

రమణమూర్తి మాట్లాడకుండా వసుం ధర వైపు చూశాడు.

కళ్ళతోనే కలవు పుచ్చుకుందామె.

ఏడు గంటలయింది. బస్సు బయలు దేరింది.

కొంతదూరం వెళ్ళిపోయాక అతనికి పెద్ద అనుమానం కలిగింది. మావయ్య కనలు తను వస్తున్నట్లు ఎలా తెలిసింది? అని.

"వసుంధర ఎంత గడుసుది! ఏమీ ఎరగనట్టు తన వెంట తిరిగింది. ముందే తన రక్షణకి ఏర్పాట్లు చేసుకుని.

ఈ ఆలోచన రాగానే నవ్వొచ్చింది. అత నికి. తను చక్కగా మోసం చేయబడినం దుకు.

"మొత్తానికి ఒక తియ్యటి కలలా జరిగి పోయింది లోజు" అనుకుని సరిపెట్టు కున్నాడు. ●



'పీరా అవిడ మంచినీళ్ళనూతిలో జారిపడి చచ్చిపోయిందయ్యా'
'పోనీలెండి. రేపటినించి చెఱువునీళ్ళు తాగుతాను!'






ఒకనాటి రాత్రి మౌల్వీ నసీరుద్దీన్‌కి కలవచ్చింది. ఆ కలలో ఎవరో కొత్త వ్యక్తి మౌల్వీతో ఇలా అన్నాడు.

"మౌల్వీసాబ్! మీరు మా నాన్న గారిని క్షమించాలి."

మౌల్వీకి ఏమీ అర్థం కాలేదు.

"ఎందుకూ?"

"మా నాన్నగారు తమ దగ్గిర పది రూపాయలు అప్పుగా తీసుకున్నారు. ఆయన ఈమధ్యనే కాలంచేశారు. పోయే ముందు మీకు ఇవ్వవలసిన డబ్బు చెల్లించమని నాతో మరీ మరీచెప్పేరు. అప్పటినుంచీ మీ అప్పు ఎల్లాగైనా తీర్చాలని చాలా ప్రయత్నాలుచేశాను. ఇప్పటికి తొమ్మిది రూపాయలు మాత్రమే జమకూడేయి. తమరు ఈ తొమ్మిదీ తీసుకుని మా నాన్నగారిని క్షమించాలి" అన్నాడు ఆవ్యక్తి.

మౌల్వీకి చాలా కోపం వచ్చింది.

"ఇదెక్కడి పెద్దమనిషి తరహా అంట. తీసుకునేటప్పుడు మీ అయ్య కులుకుతూ పట్టుకెళ్లేడు. ఇవ్వవలసి వచ్చినప్పుడు ఇదా పద్ధతి?"

"బాబ్బాబు! ఇచ్చుకోలేను ఇంత కన్న మా అయ్యని క్షమించండి. ఇవి చేతులుకావు."

మౌల్వీ మరింత కోపించాడు.

"పది రూపాయలకి ఒక్క పైసా తక్కువైతే పుచ్చుకోము. వడ్డీ ఎల్లా గూలేదు. అసలుకే మోసమా?"

ఆవ్యక్తి ప్రతిమాలినకొద్దీ మౌల్వీ మరింత బిగియసాగేడు.

అంతలో మౌల్వీకి మెలకువ వచ్చేసింది. కల కరిగిపోయింది. చేతిలో చూసుకుంటే కాళీ. వెంటనే ఆయన కళ్లు గట్టిగా మూసుకుని

'సరేలే. ఆతొమ్మిదీ ఇల్లాపడెయ్యి!' అన్నాడు. ●




**జరిగినకథ**

ఆమ్రపాలి అందచందాలను గురించి విన్న మగధరాజు బింబిసారుడు ఆమె వెలాగైనా తన దాన్ని చేసుకోవాలనే ఉద్దేశ్యంతో సంజయుడు, మరికొంతమందితో కలసి వైశాలీ నగరంలో పుత్తళికల సూత్రధారుడుగా ప్రవేశిస్తాడు రేవా ఆదేశానుసారం పాలి భవనంలో ప్రవేశిస్తాడు పుత్తళికల సూత్రధారుని వేషంలో ఉన్న బింబిసారుడు. ఆ కర్షకుడగు పుత్తళికల సూత్రధారునిపై పాలి దృష్టి పడుతుంది. బింబిసారుడు నేర్పుతో ఆనందుడినీ, పాలినీ ఆపదనుంచి తప్పిస్తాడు పాలి, బింబిసారులు ఉద్యానవనంలో కల్సుకుంటారు. ఇరువురిహృదయాలలో ప్రేమ అంకురిస్తుంది పాలిని గురించిన తగాదాలో ముగ్గురు లిచ్ఛవీయులు, అయిదుగురు పరదేశీయులు ప్రాణాలు విడుస్తారు.

## 9

వాళ్ళు వెళ్ళిన తరువాత, చిన్నవెండి పీటమీద మద్యపాత్ర ఉంచి, మహానాముడి వైపు చూడకుండానే నౌకరుకి సూచించు నట్లు అభయుడు తనమాసం అనే వలపన్నడం ఆరంభించాడు—

'విన్నావా?'

'ఆ'

'అంతా విన్నావా?'

'లేదు, వినవలసినంతే విన్నాను' అభయుడు మరేమీ చెప్పకుండా ఉండేలాగ మహానాముడు క్షీణంగా అన్నాడు—

'కాని ఆమాటల్లో ఇంకనూ వినవలసినవి మిగిలి పోయాయి సంధాగారంలో లిచ్ఛవీయులందరితో కూడిన సమితి మధ్య గొప్ప నిలకడగల సభాపతిముందు అతని కుమార్తెను గూర్చిన ప్రశ్న వేయబడుతుంది. లిచ్ఛవీగణతంత్రంలో ఎటువంటి గూఢరహస్యాన్నయినా వెదకగలవాడూ, ఎట్టి విషయంలోనైనా వెనక జరగనటువంటిన్నీ ముందుజరగబోవట్టన్నీ నిర్ణయాన్ని చేయడంలో సమర్థుడైన మహానాముడు తన గృహ విషయాన్ని ఒకదాన్ని— కన్యాదానాన్ని— నిర్ణయించడంలో అసఫలుడయ్యాడని ప్రజలంటారు. తనకుమార్తె భవిష్యానికి అంతిమ నిర్ణయం సంధాగారంలో చేయవలసి వచ్చిందా అని ప్రజలు అడుగుతారు ఒక ఆదర్శలిచ్ఛవీయుడు ఇంతటి అల్ప సమస్యను కూడా పరిష్కరించలేకపోయాడని లోకులు నవ్వుతారు. అప్పుడు లిచ్ఛవీయుల ముఖ్య హితైషి, శుభచింతకుడూ అయిన వాడికేమవుతుంది? నాకుసిగ్గుచేత తలవంచుకోవలసి వస్తుంది'

'సిగ్గుచేత తల వంచుకొన వలసి వస్తుందా? మిత్రునిమర్యాదనీమర్యాదకాదూ?'

'కావచ్చు .. నేడు నన్ను మీరింతగా గౌరవిస్తున్నారెందుకు? కాబోయే సంబంధానికి సూచన కాదుకదా?'

'కాదు, ఇది నా 'నభూతోనభవిష్యతి' నిర్ణయానికి సూచన.'

'మహానామా, నీకన్నివిషయాలూ తెలుసు కాని తిరస్కారం ఎలాచేయాలి అనేవిషయం మాత్రం నీవెరగవు.'

మితిమీరిన అమర్యాదచేసి ఆధూర్తుడైన ఆటకాడు మహానాముణ్ణి వలలో పడవేసే ఆట ఆడసాగాడు. అతనికి పాలి అవసరం. మహానాముడిచేత 'సరే' అనిపించడానికి ఇది అవకాశం. కాని మహానాముడు అభయుణ్ణి గుర్తించాడు. అతని మోసాన్ని చూచిఅతనికి చాలారోత కలిగింది అభయుడు ఎందుకోసం తన్ను పిలిచాడో అతడు తెలుసుకోవాలి మహానాముడి సంక్షిప్తమైన జవాబుల్నీ ప్రశ్నలనూబట్టి మహానాముణ్ణి మోసపుచ్చడం కష్టమని అభయుడు గ్రహించాడు మద్య పాత్ర వచ్చింది. పెద్ద మర్యాద చూప కుండానే అభయుడు దాన్ని నోట్లోకి వంపుకున్నాడు అప్పుడతడు మహానాముడివైపు చూచి అన్నాడు—

'సంధాగారంలో ఏనిర్ణయం అవుతుందో? అట్టినిర్ణయాలుపూర్వం ఎన్నో జరిగాయి. ముందుకూడా జరుగుతాయి. ఎందువల్లనంటే, ఈనిర్ణయం ప్రవేణి పుస్తకమే చేయకలదు'

అభయుడి మాటవిని మహానాముడు కంపించాడు పంచకుడైన అభయుడు అతనియీ దౌర్బల్యాన్ని చూశాడు. ముందు మాట్లాడడానికి అతనికిసాహసం హెచ్చింది—'మహానామా, సమితిముందు పాలి వివాహ ప్రశ్న ఉంచ బడుతుంది. అప్పుడు ఒకడు కాదు, అధమపక్షం వెయ్యిమంది లిచ్ఛవీయ యువకులు ఆ కుమారి ఒక్కతెకై సిద్ధపడతారు.... .అభయుడు అట్టి వెయ్యిమంది యువకులైన అభ్యర్థుల్ని నిలబెట్టుననే విశ్వాసం మీకు ఉంది. నాకీపని సామాన్యమైందని మీరూ ఎరుగుదురు. ఒక్క కన్యకోసం వెయ్యిమంది లిచ్ఛవీయులు కేకవేసి చెయ్యి చాచినప్పుడు—'

'అభయా, భయపెట్టి నన్నెవ్వడూ జయించలేడు.'

'అది నేనెరుగకేమి? ఇప్పుడు నేను మిత్రుడి కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను, అంతే. సంధాగారంలో వెయ్యిమందియువకగణనాయకులు ప్రశ్నవేసినప్పుడు ప్రవేణి పుస్తకాన్ని చూడాలి. ప్రవేణిపుస్తకం చెప్తోంది—ఒకపురుషునికోసం వేలకొలదీ లిచ్ఛవీయులు ఒకరితో ఒకరు పోరాడి మరణిస్తే అట్టిపురుషుణ్ణి చంపివేయాలి. సౌందర్యవతియైన ఏస్త్రీకొరకైనా వేల కొలదీ నవయువకులు ఒకరిని ఒకరు నష్టపెట్టుకోడానికి సిద్ధపడితే, ఆస్త్రీ అవివాహిత అయితే ఆమె ఆవేలకొలది యువకులకే కాకుండా సమస్త వైశాలికీ సంపదగా భావింపబడాలి ఒకపురుషుణ్ణి సంతోషపెట్టేచోట ఆమెకు వైశాలినంతటినీ సంతోషపెట్టు ధర్మయుతమైన ఆజ్ఞ ఉంది. పాలికి లిధర్మాజను ఆమెతండ్రి వైశాలికి 'నభూతో నభవిష్యతి' సభాపతి మహానాముడు ప్రకటిస్తాడు. ...... పాలి వైశాలిలో 'నభూతో నభవిష్యతి' సుందరి, నర్తకియై వేలకొలదీ లిచ్ఛవీయులహృదయాల్ని ఆడించగలదు.'

'పేడివా, నీచుడా'.

'నేను చెప్పలేదూ,? తిరస్కరించడం మీకు రాదని?'

'అభయా, ప్రవేశి పుస్తకంలోని న్యాయం నాకు తెలుసు. పాలిని కూడా'.....కోపంతో వణకుచూ మహానాముడు కళ్ళెర్రచేసి అన్నాడు.—

'మహానాముడి కత్తి నింతవరకెవ్వడూ ఆపలేక పోయాడనే విషయం మరచి పోకు'.

'నేను చెప్పేది కత్తిమాటకాదు. పాలి మాట. నాకై నాయిఅయ్యి. లేదా వైశాలి వదిగొట్టి పోసిగాడు. అతని హస్తాలు మాటిమాటికీ కత్తిపిడిమీదికి పోతున్నాయి. అభయుడు మహానాముణ్ణి చూస్తూనే ఉన్నాడు. అతడు నెమ్మదిగా వంగి పాత్ర నేలనుండి పైకెత్తాడు. మద్యపాత్రను పైకి తీయవచ్చిన నౌకరు అభయుడి ముఖంలో ఎప్పటిలాగ విషపూరితమైన హాస్యం ఉందో లేక హద్దులేని కోపముందో తెలిసికొన లేక పోయాడు.

* * *

మూడురోజులు గడచాయి. మూడు రోజుల వరకూ బింబిసారుడు ఒకేవని మందిరంలో యక్షిణిమూర్తి లేకపోవడం వల్ల ఆమందిరం ఏయక్షుడిదో ఎవరూ ఎరగరు. సీత అనే రాజకుమారి అక్కడికి దర్శనార్థం వచ్చేదని గ్రామవృద్ధులు తరుచు చెప్పుతూండేవారు. తరువాత యక్షులు అక్కడ నివసించలేనంత చెడుకాలం వచ్చింది. ఆమందిరం కోసం, శాక్య, మల్ల, మగధ, కాశి మొదలైన ప్రదేశాలలో నియామకంగా ప్రయాణంచేసే ధార్మికులకు ప్రధానమైన ధర్మశాల అయింది. దేవాలయానికి కొంచెము దూరములోనే ఒక పర్ణశాలఉంది. అందులో ఒకబ్రాహ్మణ విద్వాంసుడు నివసి




కంతటికీ అయినా ఉయిఅయ్యి. వృద్ధుణ్ణైన నాకిస్తే ఒక్క యువకుడైనా కన్నెత్తి చూడలేదు. ఎవడో ఒకయువకుడికి ఇచ్చావా, వేలకొలది యువకులు ఆమెకోసం చావడానికి సిద్ధపడతారు. ఈవిషయమై నీకూ నాకూ కూడా నమ్మకం ఉంది. పాలి నాది కావాలి లేదా వైశాలిది కావాలి. ఇదితప్ప అభయుడు మరో నిర్ణయాన్ని కానివ్వడని మాత్రం నమ్ము' ఇలా అని అతడు మద్య పాత్రను మహానాముడికి ఎదురుగా ఉంచాడు. ఒక్క దెబ్బతో మహానాముడు దాన్ని క్రిందికి నెస్తున్నాడు. అది పాలని చూస్తూండడం.

ఇప్పుడూ అతడు పాలినే చూస్తున్నాడు. గ్రామానికి వెలుపల ఒకచిన్న పర్ణకుటీరంలో ఇద్దరూ ఆసీనులై ఉన్నారు. పాలి తనచేతిని ఒకవృద్ధుడికి చూపడంలో మునిగి ఉంది. వృద్ధుడు తన రెండవ చేతితో బింబిసారుని హస్తాన్ని పట్టుకున్నాడు, కాని బింబిసారుని నేత్రాలు పాలివైపునే ఉన్నాయి.

నందిగ్రామానికి తూర్పున శాక్యుల సరిహద్దు ఆరంభమయ్యేచోట నందిగ్రామానికి చెందిన యక్షమందిరం ఒకటుంది, స్తున్నాడు. అనేక విధాలయిన యంత్ర మంత్రాలను ఎరిగినవాడవడంవల్ల సాకేత దేశంలోని [redacted] బ్రాహ్మణగ్రామంనుండి అతణ్ణి బలవంతంగా వెళ్ళగొట్టారు అతడు వేదాంతి. అందువల్ల అక్కడికి చుట్టుపక్కలఉన్న ఇతరబ్రాహ్మణుల మిథ్యాగర్వం, వితండవాదం, ప్రసిద్ధక్రౌర్యం చూచి వాళ్ళయెడల అతనికి అసహ్యం కలిగింది. తుదకు అతడు తన పురాతన మిత్రుడైన అభిరాముని కోరికమీద ఈయక్షమందిరప్రదేశాన్ని తననివాసంగా చేసుకోడానికి ఇష్టపడ్డాడు. ఈమందిరానికి వచ్చే ధర్మప్రవక్త

# ఆమ్రపాలి

అతో అతడు తరచు వాగ్వాదాలు చేస్తూ ఉంటాడు. చురుకైన స్వభావం కలవాడవడం వల్ల అతడు ఎవడితోనైనా తలపడతాడు. స్పష్టంగా మాట్లాడే అభ్యాసం కలవాడవడంవల్ల ఎవరికైనా తానుచెప్ప దలచుకొన్నదాన్ని చెప్పివేస్తాడు. అభిరాముడితో తప్ప అతనికి ఇంకెవరితోటీ పొసగదు. పెక్కుమందితో వాగ్వాదంచేసి శాస్త్రార్థం చేసిఉన్నా, అతడా రిక్తమందిరంలో ఏదేవునిమూర్తినిగానీ, దేవీమూర్తినిగానీ ప్రతిష్ఠింప చెయ్యనివ్వలేదు. ఈ కార్యంలో ఇతనికి అభిరాముడి సహాయమెంతోలభిస్తూ ఉండేది. అతడు నిత్యమూ సంధ్యాసమయంలో ఈవేదాంతి దగ్గరికి వచ్చి కూర్చుండి, దినమంతా జరిగిన విషయాల్ని అతనికి చెప్పేవాడు. తరవాత వాళ్ళిద్దరూ సమస్త ప్రపంచాన్నే కాకుండా, దాన్ని నిర్మించిన విధాతను కూడా తమ జ్ఞానంతో తూచి, తమ ఆలోచన అనే మత్తితో కొట్టి, తమ చిత్తక్షోభను శాంతింపజేసుకొంటూండేవారు.

బింబిసారుడు ఒక్కరోజులోనే అభిరాముని మనస్సును జయించాడు. ఈమూడు రోజుల్లోనే బింబిసార, పాలీ, ఆనందులు ముగ్గురికీ అఖండమైన సఖ్యం ఎలా కుదిరిందా అని వృద్ధుడికి చాలా ఆశ్చర్యం కలిగింది. అతని మనస్సులో ఒకేమాట భ్రమిస్తోంది— అతని మిత్రుడు వేదాంతి అయిన బ్రాహ్మడు మృతమనిషి పుర్రె పరీక్షించి భవిష్యం చెప్పే విద్యలో పారంగతుడు. మృత ఘాతకులకుసంబంధించిన వర్తమాన, భవిష్యాల్ని అతడు పూర్తిగా ఎరుగును అభిరాముడు తనపుర్రెలో తిరిగే ఆలోచనల స్థితిని గురించి ఎప్పటిలాగ వేదాంతికెరిగించి పాలీబింబిసారులభవిష్యత్తును జాగ్రత్తగా చూడగోరాడు. స్వభావానికి అనుగుణంగా మొదట వేదాంతి కోపించాడు కాని కొంచెముసేపయ్యాక శాంతించిన తరవాత అతడాయిద్దరి భవిష్యత్తూ చూడడానికి స్వీకరించాడు. కాబట్టి అభిరాముడా ఇద్దరినీ నేడు వేదాంతి దగ్గరకు తీసుకొచ్చాడు. వారిద్దరి భవిష్యం చూడడంలో వేదాంతి మునిగి ఉండగా అభిరాముడు యక్షమందిరానికి వెళ్ళిపోయాడు. పరివ్రాజకు డెవడో మందిరానికి వచ్చినాడన్నవార్తవిని అతనిసేవాశుశ్రూషకై వేదాంతి అభిరాముణ్ణి పంపాడు వృద్ధవేదాంతి పాలీ బింబిసారుల హస్తాలు చూస్తున్నాడు.

వేదాంతిముఖం మీద ఉన్నభావపరివర్తనం ఒకప్పుడు పాలిని ఆశాన్వితగామా మరొకప్పుడు చంచలగామా చేస్తోంది.

చివరికి వేదాంతి వారిద్దరి హస్తాల్నీ విడిచి, దగ్గరవున్న తులసీదళాలు నోట్లో వేసుకొని, నిట్టూర్చి తలవంకించ సాగాడు. తన కొంటెతనంతో అభిరామునిలాగే, వేదాంతిని కూడా వేధిస్తోంది. దానికి ప్రతిఫలంగా వృద్ధుడు కూడా పాలిని ఏదోవిధంగా అప్రసన్నగా చేస్తున్నాడు. ఈసారి వృద్ధుని వదన గాంభీర్యంచేత పాలిప్రాణం కంఠంవరకూ వచ్చింది. వేదాంతి భవిష్యవాణి వినడాని కామె వ్యాకులపాటుతో అతనివైపు చూడసాగింది. ఈ విషయం వృద్ధుడు గ్రహించాడు. అతడు పాలివైపుచూచి అన్నాడు— 'ఈగడ్డమువాడు రాజకుమారుడు. మహాత్ములతోడి సంసర్గం ఇతని భాగ్యంలో వ్రాయబడింది. ఇది ప్రకృతియొక్క అనుచితమైన పక్షపాతమూ, అన్యాయమూను'...... 'దేవుడెలాంటివాడు?' అని విస్ఫారిత నేత్రాలతో వేదాంతివంక చూచి బింబిసారుడన్నాడు. 'నన్ను భగవానుడని అనకు, వేదజ్ఞుడను.' అభ్యాసామిపారం వేదాంతి తన పొరపాటు సవరించుకుంటూ అన్నాడు. — ఇది ప్రకృతియొక్క పెద్దదోషమేకాదా?' నీవొక విద్వాంసుడైన శాస్త్రి దగ్గర కూర్చున్నావు. నీబుద్ధి ఈబాలికను చూడడంలో లగ్నమయింది. చెప్పు, నీవు నాదగ్గర కూర్చోడానికి అర్హుడవే? అయినా, కూర్చున్నావు. ఇదిప్రకృతియొక్క ఘోరమైన అన్యాయం, ...... మంచిది నీవెక్కడి రాజువు?

'నేనురాజును కాను. కాని ఏదేశంవాడనోమాత్రం మీకు చెప్పాలి మీరే వేదజ్ఞులూ, శాస్త్రజ్ఞులూ కదా!'

'రాజును కానని నీవు నిజం చెప్తున్నావా?' అని వృద్ధుడు సన్నటి చూపు సారించి అడిగాడు.

'లేదు, కాను.'

'అయితే కొద్దికాలంలోనే కావాలి.'

'. ఎంత సేపట్లోతాతా?....' అనేమాటలు అకస్మాత్తుగా పాలినోటినుండి వెలువడ్డాయి. ఆమె సిగ్గుతో తలవంచుకొంది

వృద్ధుడు తప్పు పట్టడానికి కృత్రిమమైన కోపంతో అడిగాడు. 'నీవెందుకడుగుతున్నావు? నీభవిష్యత్తు చెప్తున్నానా? ఇతని భవిష్యత్తు చెప్తున్నానా? సరే, అదృష్టవంతుడైన ఓ యువకుడా, నీవు రాజువేకాదు, మహారాజుకూడా అవుతావు... చక్రవర్తి వవుతావు.'

'ఇది తమవంటి వారి ఆశీర్వచనంవల్లనే అవుతుంది.'

'ప్రకృతికి ఘోరమైన అన్యాయమవుతుంది.' పాలి గంభీరమై అరచింది.

బింబిసారుడు నవ్వాడు. ఉత్సాహానికి వశుడై సంకోచంలేకుండా అడిగాడు—

'వేదజ్ఞా, చక్రవర్తి నవుతానుగాని ఏదేశానికి?'

'తూర్పు దేశానికి, నువ్వు తూర్పువాడవు'

'తూర్పువాణ్ణి కాకపోతే?'

'అయితే అసత్యవాదివి.'

'అసత్యవాది చక్రవర్తి ఎలా అవుతాడు?'

'హృదయంలో కపటం లేకపోతే కావచ్చు. అందువల్లనే నిన్ను భాగ్యశాలిని చేయడం ప్రకృతికి ఘోరమైన అన్యాయమనిచెప్తున్నాను. అది నీకు దౌర్బల్యంతో పాటు నాలుగందమైన వస్తువులనిచ్చింది నీవసత్యవాదివైనా చక్రవర్తివి కాగలవు.'—

'తాతా, నాచెయ్యిచూస్తూ ఇతని భాగ్యాన్ని చెప్తున్నావా?'...... అని పాలి ముఖం పైకెత్తి అంది. వేదాంతి ఉలికిపడి చూచాడు. మాటల సందడిలో ఇతడు పాలి చెయ్యి పట్టుకున్నట్లు అతడు గమనించాడు. పాలిమనసులో తిరుగుతున్న మాటే వేదాంతి మనసులో ఉంది. అతని మౌన హృదయం పాలి భవిష్యాన్ని తెలుసుకోడానికి చాలా వ్యాకుల పడింది

తనమనస్సులో మాట ప్రకటం కాకుండా ఉండే లాగ అతడు నవ్వడానికి యత్నించాడు నవ్వి అన్నాడు

'ఇందువల్లనే పాలీ ఇతని చెయ్యిపట్టి నీభాగ్యాన్ని చూశాను.'

'కాని నాభవిష్యం ఇంతవరకూ చెప్పలేదే?'

'నీ నీఒక్కతెకే చెప్పనా? లేక మీ యిద్దరికీ చెప్పనా?'

'నాఒక్కదానికే చెప్పుతాతా.'

'కాదు ప్రభూ,'అని బింబిసారుడు భిన్నాభిప్రాయాన్ని ప్రకటించాడు.

'ఎందుచేత?' అని పాలి బొమలెత్తి అడిగింది

'ఇదిఘోరమైన అన్యాయమవుతుంది, వేదజ్ఞా',

'ఎలాగ?'

'పాలికి వినిపించడానికి మీరు నాభవిష్యత్తు చెప్పారు ఇప్పుడు నాకు వినిపించడానికి పాలి భవిష్యాన్ని చెప్పాలి'

వేదాంతి బింబిసారుని వైపు చూడసాగాడు. అతడు ముఖం తిప్పకుండానే పాలివంకచూచాడు. తరవాత బింబిసారుని వైపు చూచి ఇద్దరికీ వినిపిస్తూ చెప్పసాగాడు. 'మీ ఇద్దరి మనో వాంఛా నెరవేరుతుంది ... కాని అమ్మాయీ, 'నువ్వు మహారాణివి కావు' అని పాలివంక చూచి అన్నాడు.

'ప్రభూ,'.... బింబిసారుడి ముఖంలోని రక్తం అకస్మాత్తుగా ఇంకినట్లయింది. వేదాంతి అతణ్ణి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. కొంతసేపయిన తరవాత అతడు పాలివైపు దృష్టి మళ్లించి మందహాసంచేసి చెప్పసాగాడు. 'బిడ్డా, జీవితంలో సుఖదుఃఖాలెల్లప్పుడూ ఒకదాన్ని ఒకటి ఓడించడానికి ద్వంద్వయుద్ధం చేస్తూనే ఉన్నాయి. మానవుడెవడూ వీటి నుండి విడువడలేదు. వీటిలో ఏది అనేక శక్తిశాలి అనేవిషయం ఎవడూ నేటి వరకు నిర్ణయించ లేక పోయాడు. కారణం అవి ఒకటి రెండో దానిచేత ఓటు పడుతూ ఉంటాయి. నీవు జీవితంలోని అంతిమ దినాలను ఇంతకంటే ఉన్నత మైన స్థాయి లోగడపుతావు, నీకు బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. బహుశా నువ్వు ప్రపంచాన్ని కూడా త్యజిస్తావు'.

'కాదు, కాదు ప్రభూ నేను అలాకానివ్వను ఎన్నటికీ కానివ్వను. ఆశీర్వదించండి, ప్రభూ. ఇలా అని ఆశీర్వదించండి.'

ఆత్మనిగ్రహాన్ని కోల్పోయిన బింబిసారుని క్షుభిత హృదయంనుండి ఈమాట వెలువడింది. కాని తేరుకోగానే అతడు సంకుచితు డయ్యాడు. పాలీ, వేదాంతి అతని ఆవేశంలో గర్భితమైన ప్రేమనీ, విశ్వయాన్నీ మాట్లాడక చూస్తున్నారు.

బింబిసారుడు మళ్లా తలపైకెత్తి, 'ప్రభూ, మాకోరికలు నెరవేరుతాయని మీరు యిప్పుడే కదా చెప్పారు. ?' అని ప్రశ్నించాడు.

''నేను 'మీ' కోరిక నెరవేరుతుంది అన్నాను. 'నీ' కోరిక నెరవేరుతుంది అనలేదు''

'ఇందులో విరోధం ఉండదా?'

'లేదు'

'చాలు ప్రభూ, ఇలాగే ఆశీర్వదించండి.'

బింబిసారుడు అధికంగా మాట్లాడలేక పోయాడు. పాలి ఇంకా విస్మిత అయి అతని ముఖంవైపు చూస్తోంది. చివరికి ఇద్దరూ వేదాంతి ఆశీర్వాదాన్ని పొంది వెళ్లసాగారు. వేదాంతి శాంతంతో ఇద్దరూ పోతూండడం చూస్తున్నాడు.

ఇంతలో దూరంనుంచి వచ్చిన అభిరాముడి కేక అతని ధ్యానాన్ని భగ్నం చేసింది. వేగంగా పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. ముసలితనం చేత శుష్కించిన అతనికాళ్లకు నూతనయువ్వనం లభించినట్లుంది. అతడు వేదాంతిని సమీపించే లోపలే బింబిసారుడూ, పాలీ దూరంగా పోయారు అతని ముఖంలో భయంకరమైన ఆవేశం కన్పిస్తోంది. అప్పుడప్పుడు యుద్ధంలో జయం పొందినప్పుడూ అలాగే అభిరాముడు ఉన్మత్తు డవుతూ ఉంటాడు. అతణ్ణి చూచి వేదాంతికోపించాడు—ఈవృద్ధుడికి యువ్వనం జ్ఞాపకం రాలేదు కదా? ఎవరి శరీరాన్నయినా గాయపరచో లేక ఎవరినైనా ముక్కముక్కలుగా చేసో ఇక్కడికి రాలేదుకదా? దెబ్బలాటన్నా, హింసన్నా వేదాంతి కెంతో అసహ్యం. వేదాల్ని నిత్యం మననం చేసిన తరవాత అతడలాంటి విషయాలనెన్నో త్యజించాడు వాటినుండే ప్రాణం తియ్యడమనేసని అతని హృదయానికి అమితమైన దుఃఖం కలిగిస్తుంది. వేదాలలోని అగమ్యమైన విషయాలని తెలుసుకోడానికి అతడప్పుడప్పుడు వ్యాకుల పడతాడు. కాబట్టి అభిరాముడు ఉత్తేజాన్ని కలిగించే మాటలు చెప్పడానికి ముందే అతడు మృగచర్మాన్ని పట్టుకొని సంధ్యాకార్యానికై పర్ణకుటీరం లోపలికివెళ్లడానికి నిలబడ్డాడు. కాని అభిరాముడు పొరబడేవాడుకాడు. అతడన్నాడు—'మిత్రుడా విను.'

'విన్నాను, ఎంతమందిని చంపాడు?'

'అరే నేనే చచ్చాను, సోదరా, నేనేస్వయంగా చచ్చాను'

'నీవు చని.........' వేదాంతి ఏదో అనదల్చాడు. కాని మాట్లాడలేక పోయాడు. కొంతసేపైన తరవాత నవ్వి అతడు,'నీవెప్పుడు చనిపోయావు?' అని అడిగాడు.

'కొన్ని క్షణాలకి పూర్వమే. ఇది చెప్పడానికే వచ్చాను.'

అభిరాముని కోసం వేదాంతి ఇప్పుడు నిజంగా భయపడ్డాడు. అభిరాముని స్వరం మారిపోయింది. అతని ముఖంలో సాధారణమైన గాంభీర్య స్థానంలో ఒకవిధమైన నవ్వు హాసం ప్రకాశిస్తోంది. చుట్టబెట్టిన మృగ చర్మం క్రిందఉంచి, అతడు అభిరాముని చెయ్యిపట్టుకొని క్రింద కూర్చుండబెట్టాడు.

'చూడు అభిరామా, వైద్యుని బుద్ధే నిరుపయోగమైతే మందెవరిస్తారు?'

' నాకు మందవసరం లేదు. తెలివీ అక్కరలేదు. విప్రుడా, నాకు అవసరమైన అలభ్యవస్తువు నేడు అకస్మికంగానే నాకు లభించింది. మిత్రమా, నేను మరణించాను. ఏమంటే, నాకిప్పుడు పునర్జీవితం అనుభూతమవుతోంది. నా



మంచి దృష్టి హఠాత్తుగా ఉజ్వలమయింది. నాశరీరంలో వెయ్యి అశ్వాల శక్తి ఒక్కసారిగా పరుగెత్తింది. నేనంతా చూడ గలను. మనస్సులోని నాసందేహం దూరమైంది. అంతులేని శాంతిసీమ నాకు తెలిసింది. అక్కడికి పోవడమే ఆలస్యం. కాబట్టి నిన్ను తీసుకుపోడానికి వచ్చాను. నడు, యువకుడా, నాతోయక్ష మందిరానికి నడు....'

'యక్ష మందిరానికా? అక్కడికి ఎవ రైనా పరివ్రాజకుడు వచ్చాడా?'

'శాక్య రాజకుమారుడు, శాక్యమునిని నీవెరుగుదువా?.... ఆయన వచ్చాడు.

## ఆమ్రపాలి

నేను ఆయన్ని కలుసు కున్నాను. ప్రేమ చూపులు నామీద ప్రసరింపజేసి అతడు నాప్రాణాలనూ, హృదయాన్నీ తనవైపుకు లాగుకున్నాడు. నేనాయన దగ్గర కూర్చు న్నాను. ఆయన ఉపదేశాలు వినడంలో లీనమయ్యాను. ఒక యువకుడు లౌకికా లౌకిక జీవిత రహస్యాలనూ, చమత్కారా లనూ ఎరగ గలడని నేను ఒప్పుకున్నాను. వేదాంతీ, నిజానికి మనం ఒప్పుకోము. శాక్యముని యువకుడు. అతడన్నీ ఎరు గును. నేను చెప్పుచూ పోయింది, నేనడి గిన ప్రశ్నలూ— ఆ గూఢమైన ప్రశ్న లన్నీ అతి సామాన్యమైనవిగాఅయి నా ఎదుట ప్రకటితమవుతున్నాయి. నేను మౌనంగా వాటిని చూస్తూ ఉన్నాను. క్రమంగా హృదయంలో వెలుగుతో చింది. నాకొక దివ్యజ్యోతి లభించింది. నేనతని పాదాలమీద పడ్డాను. నేను మరణించాను. నాకు పునర్జన్మ కలిగింది. శాక్యముని అద్భుతమైన వాడు, అలౌకి కుడు. నాదృష్టిలో అతడు సర్వజ్ఞుడు. వేదాంతీ. నడు, ఇప్పుడే నడు— నీవేదాంతా నికి ఆద్యంతాలు శాక్యమునిలో లీనం అవుతాయి. నీకు అక్కడ శాంతి లభించక పోతే, నీవేశిక్ష విధించినా దాన్ని అను భవించడానికి సిద్ధంగా ఉన్నాను. మిత్రమా, నేను మరణించాను. నువ్వు మరణించడానికి నిన్ను తీసుకుపోడానికి వచ్చాను.'

'శాక్యమునా? ఆలార్కాలాముడు ఎవణ్ణి గురించి ఈర్ష్యతో అన్నాడో అతడు కాదుగదా? అతడు ప్రతి ఒకడికీ దీక్ష ఇస్తాడు. మన గ్రామంలో చెప్పులు కుట్టే వాడొకడు అతని దగ్గరనుండి దీక్ష తీసుకున్నాడు. నీచజాతివానికి దీక్షా? భిక్షకులతో తిరుగుతూ శాస్త్రాధ్యయనం చేసేవాడేనా? భారతదేశంలోని అనాది ధర్మాన్ని ఎదిరించి ఈ శాక్యముని స్వయంగా ధర్మోపదేశకుడు కాగోరుతున్నాడా? సరే, ఆ అధర్మపరుణ్ణి, శాక్యగౌతముణ్ణి చూస్తాను'—

'బుద్ధుణ్ణి, గౌతమబుద్ధుణ్ణి— అని చెప్పు' అని వేదాంతి పొరపాటు సవరిస్తూ అభిరాముడన్నాడు—

'అతని శిష్యులతణ్ణి గౌతమబుద్ధుని రూపంలో గుర్తిస్తారు— పరిపూర్ణ జ్ఞాని అయిన గౌతముని రూపంలో!

అక్కడ నిలబడి అభిరాముడు అధి కంగా మాట్లాడ్డానికి ధైర్యం కోల్పో యాడు. సర్వశాస్త్ర విదుడైన వేదాంతిని శాక్యముని దగ్గరకు తీసుకుపోడానికి అతడు ఆతురత చెందుతున్నాడు. కాబట్టి వేదాంతిని యక్షమందిరం వరకూ తీసు కొనివచ్చిన తరవాతే అతనికి శాంతిలభిం చింది. యక్షమందిరము దగ్గరకువచ్చిన తరవాత ఇద్దరూ ఒకరినొకరు చూచుకో సాగారు. యక్షమందిరం శూన్యంగా ఉంది.

(సశేషం)






సజీవ జంతువులలోనూ, క్రిమికీటకాదుల లోనూ కూడా సామరస్యము (symmetry) కనిపిస్తుంది. ఆవూ, మేకా, ఉడతా, చీమా ముందువైపునుంచి చూస్తే కుడివైపుకి ఏలాటి నిర్మాణముతో వుంటాయో, ఎడమ వైపుకీ అలాటి నిర్మాణముతోనే ఉంటాయి. చెట్లు సామాన్యంగా వాటి కొమ్మలను అన్ని వైపులకీ పెంచుకుంటాయి. శృంగాకార (coniferous) వృక్షాలలో ఈ సంగతి చక్కగా విశదమవుతుంది. భూగర్భములో మట్టిలోచొచ్చుకుని వ్యాపించవలసిన వేళ్లు కూడా గుబురుగా అన్ని వైపులకీ (మొత్తము మీద) సమానముగానే పెరుగుతూ పోతాయి. సృష్టిలో ఒక పార్శ్వముమీద, ఒక దిక్కుమీద, కుడివైపుగాని ఎడమ వైపుగానీ, పక్షపాతము అన్నది కనిపించదు.

ఈ సంగతి అందరికీ అనుభవమే. అయితే టార్టారిక్కు ఆమ్లము అనే రసాయనిక ద్రవ్యములో కనపడే 'ధ్రువీకృతకాంతిని తిప్పే గుణము' దానివంటిదే అయిన పేరా టార్టారిక్కు ఆమ్లములో కనబడకపోతే ఆగుణము దీనిలో లేదనే అనుకున్నారుగాని ఎందుకని కనబడడములేదూ అని పాశ్చరు కాలానికి వైజ్ఞానికులు శోధించలేదు .... శంఖాలు అనేకం చూచివుంటారు మా పాఠకులు. వాటిమీద శంఖ నిర్మాణరేఖ, 'స్ప్రింగు' సర్పిలా తిరుగుడుతో కనబడుతుంది. శంఖ శిఖరమును కంటివైపూ, 'తోకను' కంటికి దూరంగానూవుండేటట్టు పట్టుకునిచూస్తే కొన్ని శంఖాలమీది సర్పిలరేఖపై 1 సర్పిలాకారంలోనూ, కొన్ని శంఖాలమీదిది క్రింది 2 సర్పిలాకారంలోనూ గోచరిస్తుంది అయితే ఈ రెండింటిలోనూ ఒక రకమే ఎక్కువగా కనిపిస్తుంది రెండో రకానివి మొత్తమ్మీద అరుదు. ఉండను మాత్రము ఉంటాయి.....స్క్రూలన్నీ, బిగించాలంటే వాటిని కుడివైపే—గడియారము ముళ్లు తిరిగేవైపు—తిప్పవలసి ఉంటుంది. అయితే ఎడమవైపు తిప్పితే బిగిసే స్క్రూళ్లు అసలే ఉండవా? అంటే లేవని అన వీలులేదు. ముక్కుపుడకలకూ, దుద్దులకూ స్క్రూలు ఎడమవైపు తిప్పితే బిగుస్తాయి. అలాగే, ఎక్కువ మందిమి మనము కుడిచేతిని వ్రాయడానికీ, రాయి విసరడానికీ ఉపయోగించే వాళ్లమే అయినా పురచేతివాళ్లు అసలు లేరని చెప్పలేముగదా? అలవాటూ, ఉప దేశమూ వద్దన్నా ఎడమచేతి వాటమువారు ఉంటూనే ఉన్నారన్నది సృష్టిలో పక్ష




పాతము లేదనడానికి ప్రబల సాక్ష్యముకదా? సామరస్యమన్నది సృష్టిలో కనబడే ధర్మము.

అందుకే లూయీపాశ్చరు పేరా టార్టారిక్కు ఆమ్లములో 'ధ్రువీకృతకాంతిని తిప్పే గుణము' లేదనగానే ఆశ్చర్యపోయాడు. "టార్టారిక్కు ఆమ్లములో ఉన్న గుణము, దాని రూపభేదమే అయిన పేరా టార్టారిక్కు ఆమ్లములో ఏమయిపోయింది?" అని ఆలోచించాడు. (టార్టారిక్కు ఆమ్లము 'ధ్రువీకృత కాంతి'ని కుడివైపు తిప్పుతుంది అని మిట్షెర్‌లిక్ వ్రాశాడు). పాశ్చరు ఈ చిత్రము ఎందువల్లనో అని శోధించాడు. ఆ గుణము కనబడని పేరాటార్టారిక్ ఆమ్లమును సాంద్రతము చేసి, అది స్ఫటికాలుగా ఏర్పడటానికని, వాడిగా ఉంచిన కోష్ఠములోఉంచి చల్లార్చాడు. ఏర్పడిన స్ఫటికాలన్నీ ఒకే రూపంగా లేవు. ఒక రకంలో 'విశిష్ట ముఖము ఒకటి' కుడివైపునవుంటే, రెండో రకములో అదే ముఖము ఎడమవైపునకు వుంది. అంటే ఏమన్నమాటా? పేరాటార్టారిక్కు ఆమ్లము వాస్తవానికి రెండు రకాల టార్టారిక్కు ఆమ్లముల సమ్మేళనమన్న మాట. టార్టారిక్కు ఆమ్లమన్నది కాంతి పార్శ్వమును కుడివైపుతిప్పుతుందని తెలియునే తెలుసును. పై రెండురకాలలోనూ ఒకటి అదే అయివుంటుది. "ఇక రెండో రకము, కాంతిని ఎడమవైపు తిప్పేదే అవాలి. అది కుడి వైపుకి ఇది ఎడమవైపుకీ తిప్పి మొత్తము తిప్పటమును సున్నచేసి పెట్టాయి" అని ఆలోచించి, పాశ్చరు రెండో రకాన్ని సోదా చేసి, అది ఎడమవైపునకు తిప్పేదేనని నిరూపించాడు. ఇది ఒకటోరకము పరిశోధనా ఫలితమూ కూడాను.

పాశ్చరుకి తన పరిశోధనసృష్టి సూత్రాన్ని విశదీకరించేటిదేకాని ఒక మూలవున్న పేరా టార్టారిక్కు ఆమ్లములోని రెండురకాల్ని విశ్లేషించిన ఇరుకుపరిశోధనకాదనీ తెలుసును. కొన్నిశర్కరలు కాంతిని ఒకవైపేతిప్పేయి, వాటిలో రెండోవైపు తిప్పేవి కానరాలేదు. దీన్నిబట్టి సృష్టిలో సహజంగా ఆరకమో

## వైజ్ఞానిక గాధాశతి

ఈ రకమో మాత్రమే తయారవుతాయని చక్కెర ఆకారణమునల్లనే ఒక రకంగానే తయారవుతోందని పాశ్చరు తీర్మానించుకున్నాడు. న్యాయమేకదా? చక్కెర చెరకు గడలో సహజంగా తయారవుతోంది, అది కాంతిని ఒకవైపే తిప్పుతోంది. "ప్రాణుల శరీరాలలో నడిచే ప్రక్రియలు అసామరస్యముగా సాగుతున్నాయన్నమాట" అన్నాడు పాశ్చరు. అయితే, "సామరస్యముకదా సహజము? — అసామరస్యమే జీవ ప్రక్రియకు సహజమని అనడము సాహసముకాదా" అని అంటారేమో పాఠకులు. నేలకులో కాక ఇంకొక జీవశరీరములో అవతరిరకపు అసామరస్యమున్నదేమో?— వెదకాలి. అంతే కాని 'బెల్లకువంచదార'లో స్ఫుటముగా కనబడే అసామరస్యమును ఎలాగ కాదనగలము? పాశ్చరు సృష్టిలో అసామరస్యమే ఉన్నదనుకొనమేకాక మరొక అడుగు ముందుకువేసి, "రసాయనిక క్రియలలోనికి అసామరస్య శక్తుల ప్రభావమును ప్రసరింపజేసి అసామరస్య స్వభావులగు చక్కెరవంటి పదార్థాలను కృతకంగా తయారు చెయ్యవచ్చును" అని చెప్పేడూ అలాగ, జీవ ప్రక్రియలను గాజు గొట్టాలలో నడవడానికి ప్రయత్నముచేశాడు. అంటే గాజు గొట్టములో జీవ వ్యాపార సృష్టిని—అనగా జీవసృష్టినేకదా — చేయడానికి యత్నించాడు. కృతకృత్యుడు కాలేదనుకొండి. అయితే వైజ్ఞానికుని జిజ్ఞాసా తత్వము మాటికిమారుపాళ్ళా ఉంది లూయీ పాశ్చరు తత్వంలో. ఈ పరిశోధన తరవాత తాను పట్టిన "కిణ్వన" (fermentation) సమస్యలో, "జీవము దానంతటికి అదే పుట్టుకొచ్చి మాంసాదులు కుళ్ళి పురుగులు పట్టుట్టున్నా, మజ్జిగా సారాయిమూ పులిసిపోతున్నాచేస్తున్నదన్న" సమకాలిక విశ్వాసాన్ని— తనకు అనుకూలముగా ఉన్నదని దొరకబుచ్చుకొక— ప్రయోగ మూలకంగా విచ్ఛేదించి, "జీవమన్నది జీవమునుంచే పుట్టాలిగాని అజీవమునుండి పుట్టనేరదు" అని ఉద్ఘాటించాడు పాశ్చరు. ప్రయోగ సాక్ష్యాన్ని మాత్రమే ప్రకటిస్తూ తన ఇష్టానిష్టాల్ని తొక్కిపెట్టిన విజ్ఞాని, మహర్షి కాదూ పాశ్చరు?



# తెల్లకోక

— పులగా భాస్కరరాజు

లోకంమీాన సాన యిసిత్రమైన మనుసులుంటరు. ఆ యిసిత్రమైన మనుసులకు సాన సాన యిసిత్రమైన కోర్కెలుంటయి. అసలే మనుసులంటె దేవురికి సాన ఈర్సాయె! వాన దుట్టుముంటె బంగారముమీాన కూసుండబెడ్తడు. ఆన్కె కోపం గనుక అత్తె మట్టిపుంపుతడు.

*   *   *

ఆకాసంమీాన సూర్యుడు శిన్నంగ శిన్నంగ పొకుతాండు. ఎండ శాన ఏడిగా సంపుతాంది. అడగాలి రయ్‌మంట ఈత్తాంది.

సెర్వుకట్టావల సెంద్రిగాడు, పోశిగాడు, పుల్లి రామక్కకొడుకు మైసడు, గొడ్లు గాత్తాండ్లు. ఒడ్రెమీాన ఆవసెట్టుకింద ముగ్గులు కూసున్నలు. ఒడ్రెనుక గడ్డమీాన గొడ్లు మేత్తానయ్.

"ఓరి......సెంద్రిగా......! నీ పెళ్లాన్ని డక్కలోడు ఎత్తుకపోను. గొడ్లు సేళ్ల బడతానయ్‌రో...... బగ్గదివి సెట్టుకింద బన్నావ్." అంట సెర్వుకట్టుమీాన ఐలోని దొర పెద్సంగ అరిశిండు.

కునుకుమీానడున్న సెంద్రిగాడు, ఐలోని దొర మాటలు ఇంటనే శిమకరిశినోన్లా కళ్లిప్పిండు. ముంగట పోశిగాడు, మైసడు, ఏటో సూన్నంలోకి సూత్తాండ్లు. సెంద్రిగాడు ఒక్క ఛనం సుట్టూ సూశిండు. అంతల్నే శిన్న రామసెంద్రుగాడి కొడుకు సాంబిగాడు పొలంకాడ్కి వానయ్యకు సద్ది పట్కపోతాండు. అన్నిసూత్తనే సెట్టుకింద ఉన్న సెంద్రుగాన్కి పాణమచ్చింది.

"వోరి......సాంబిగా....! మన దొరోరి శేళ్ల గొడ్లు బడ్డయట. కసమ్రేశిపోరో" అంట సెప్పిండు.

"మనిషిది" అంట ఎళ్లిండు సాంబిగాడు.

వక్కమీాన్కి ఏసుకున్న కండ్వనుదులిపి, ఎన్నుమీాన కప్పిండు. వక్కకు వోశాతు మీాన కూలిండు. బొడ్లెదోపుకున్న సుట్టను, మెల్లంగ ఈవలికి లాగిండు. సుట్టారా మాత్తె నుప్పురవ్వ ఏడాలేదు. మెల్లంగా దొరేరి కంచెకాడ్కి నడిశిండు. సుట్ట అంట పెట్టుకొని ఒడ్రెమీానికి అచ్చిండు. పోశిగాన్ని, మైసన్ని, సూత్తనే "ఇవారకు సద్ది రాలేదేమిరా" అంట అడిగిండు.

"మరనేమిరా," అంటు పోసిగాడు సుతేశిండు.

"మా...... అవ్వ, ఇంటికాడలేదేమొ" సెంద్రిగాడు పల్కిండు.

"అదిగాదురా ఇయ్యాల మీాబావచ్చిండు," అంట మైసడు పొత్తేసిండు.

సెంద్రిగాడికళ్లు శాన ఇసిత్రంగా..... సూసాయి. ఏ బావరా అంట అడిగిండు.

"అదే......! మీా కొమురుమ ఇచ్చిండ్లు మా......డూ......?"

"ఓహో......మానడిపి బా.....వా....!"

"ఆ......ఆ...... ! మీా దుర్గయ్య బావే వచ్చిండట."

"ఇంకా గాడే పోలేదాయె. మాబావ ఏనంగ అచ్చిండురా......?"

"ఈ గాడికి గాదురా యేగిలిబారంగ వత్తడు సూడు.....? సొపెందరగాదానికి."

"అందుగావచ్చు సద్ది ఇవారకు రాలేదు," అంట పోశిగాడు సుతేసిండు. "మా బావత్తాంది రా......? వో భంగిన కడుపుల మంట మండుతాంటె ఇవారకు జాడలేదు" మెల్లంగ వశిగిండు సెంద్రుగాడు.

"ఆదిగాదురా. రాక రాక అచ్చె. అదిగాక మేనోడాయె. ఓ కోడిపిల్లను కోశి ముంతెడంత కల్లుబోట్టు పోత్తె, మీా బావ కులిదీరె. గట్ల మనసాత్రం."

"అగో......? మీా రాజిగాడు అత్తాండు. సద్ది వత్తాందిగదా" అంటమైసడు సెప్పిండు.

రాజిగాడు అత్తనే సద్దిముల్లె పట్టుకొని బాయికాడికి ఉరికిండు సెంద్రుగాడు. అంతల్నే పోశిగాన్కి, మైసనికిసద్దచ్చింది. ముగ్గులు బువ్వ తిని ఒడ్రెమీానికి శేరుకున్నరు. రాజిగాడు పొయేతప్పుడు సెంద్రుగాన్ని వో బీడి ముక్క అడుక్కొని "వో ..... సెంద్రన్న దుర్గయ్య బా వచ్చిండు గాదే" అంట సంబ్రముతో సెప్పిండు రాజిగాడు.

"మా గెరుకె, గాని మవ్వు పోత, పోత తొవ్వన ఆవులను మర్రేశిపో అట్లనే. గామోరితాన సెయ్యాది మేత్తాంది. దాన ఇట్లు తోలిపో."

రొద్దుగాల సెంద్రుగాడు పొలంకాడ

కోశిన గడ్డిమోపు నెత్తిమీన పెట్టుకొని కుడ్డెకాడ్కి వడిశిండు రాజిగాడు.

కవ కడుపుల సల్లబడంగనే పాణం ఆయిమన్నదే. సెంద్రదన్న—అంట మైసడు వోటంట సెప్పిండు.

"మాటగానీ......బొగ్గులేంది గాడినడ్తదిర? మరిగిదిగట్టనే, బువ్వతింటేనే పాణంలా వల్లగ."

"అదెపొయిగానీ....ఇయ్యాల కొత్త శిలు మచ్చిందట, మూత్తామూరా. కొట్లాట బాగుం దటనే....!" మెల్లంగ ఇడిశిండు పోశిగాడు.

"నిజంగానే, మూత్తామానే....? నేను ఇవారకు శిలుమ మూల్లే." సుతేసిందు మైసడు.

"సూత్తాంగానీ,కాలబడి మనూళ్లలేదాయె శిలుమ. గంతదూరం వడువాల్నాయె."

"ఏహె......వీ...... ! పోదామె మంచి గుంటది. ఆడతీరుతీర్ల మోటార్లు, రిచ్చి శాలు, సైకోళ్లు."

"మరికొత్తలు కావదో......?" సెంద్రు గాని పత్న.

"వో పీనీ......" అరంజి సీ కద్దులే, మీయి గూడ నేను పెట్టుకుంట" అంట సెప్పిండు పోశిగాడు.

## తెల్లకోక

"నాతాన రెండు అర్ధబండీ లున్నయ్," సిన్నంగ సెప్పిండు మైసడు.

అయిందాన్కి వడ్తాంతీ పొద్దూకినంక.

శాయింత్రి ఐంది. వూరబిష్కలు కిన, కిన మంట ఉర్కుతానయ్. సెంద్రుగాడు, పోశి గాడు, మైసడు గొడ్లను వూళ్లకు తోల్క పోయిండ్లు.

సిన్నంగ ఇంట్లకు జొర్రిండు సెంద్రు గాడు. ఎవట్ల గర్కపోత్తాంది సెంద్రుగాని అవ్వ. "అయ్యేటు బోయిండే...? ఇయ్యాల పొలంకాడికన్న రాకపాయె" అంట అడిగిండు సెంద్రుగాడు.

"ఏగిలి బారంగ బండికి దుర్గయ్య బా వచ్చిండుగాదురా......?

"ఏడి మరి యాడ కనబడకపోయెను?"

"అయ్యున్ను, బావ గూడి తాళ్లళ్లలకు బోయింద్రు. జరదాల్లంక అత్తరు."

"అదెపొయిగానీ.....! బుక్కెడంత గర్క బడేయ్. పెరుగుతోని, ఇంతంత నల్లబడ్తా" అంటు సెంద్రుగాడు బాయికాడ్కిపోయి, కావాలు, జవతాపాలు సేసిండు.

మలంక మంచంమీన కూలబడి సావ లోతుగా సొంచాయించుకుంటాండు సెంద్రు గాడు. 'లచ్చిమితోటి సెప్పుదునా....? అద్దా?' అనుకుంటాండు అంతరెల్లెమే దిగ్గనలేశి లచ్చిమి ఇంటికి సేరుకున్నడు.

సెంద్రుగాడు ఇంట్లకు ఎల్లేటకల్ల లచ్చి పొయిల కట్టె లెగేత్తాంది. బువ్వారబెడు తాందేమొ.....? కుడిబాజుకు దానయ్య నారాయణ మంచంమీన పన్నెడు. సెంద్రు గాన్ని సూత్తనే, నారాయణ "మంచంమీన కూసుందువురార" అంట పక్కకు జరిగిండు. లచ్చిని సూత్తనేపోయి మంచం పట్టెమీన కూసున్నడు సెంద్రుగాడు.

"ఇయ్యాళ పొలంకాడ్కి రాలేదేంరా...?" అంట అడిగిండు నారాయణ.

"అవ్...... ఇయ్యాల ఒర్రెలాన్నే గడ్డి కోసుకుంట ఆన్నేఉన్న. ఆయింకలరాలే."

"ఈ యేడు మీ పొలం బాగానె ఉన్న దిరా, సావసం బెల్తది."

"యాడనే జెర్రంత పురుగుబట్టినట్లు న్నది. మీది మంచిగినింది." అంటసెప్పిండు సెంద్రుగాడు.

"ఏమో......? కొడుకా మాటసొప్పుత నో అయిదారువుట్లు ఎల్లితే ఈ యేడు లచ్చిమి పెళ్లి సేయాలనుకుంటావ." మెల్లంగ గొణిగిండు నారాయణ.

లచ్చిమి సెంద్రుగానిముఖాన సూసింది."అవ్ సెయ్యాలె! ఆడపోరగాళ్లను ఎన్నాళ్లని ఇంట్లుంచుకుంటాం. ఇయ్యాలగాకున్నా రేపైనా ఎల్లేదేనాయె. అందులో పడుసు పొల్లాయె." అంట సెప్పిండు సెంద్రుగాడు.

అంతలే లచ్చి బువ్వకుండ దింపి పోయి బైట నిల్సుంది. నారాయణతో ఆమాట, ఈ మాట మాట్లాడి మెల్లంగ ఈవలికి జారుకున్నడు సెంద్రుగాడు.

ఈవల బీరల పందిరికింద నిల్సున్నది లచ్చి. సెంద్రుగాడు సూత్తనే లచ్చి దగ్గ రకు సేరుకున్నడు.

"ఏమే, ఇయ్యాళ ఒర్రెలాన కల్తనని కలు లేదు......?" సెంద్రుగాడు అడిగిండు.

"ఇయ్యాళ మా అవ్వతోటి ద్వారోరి పొలా కలుపుదీయపోయిన" సెప్పింది. అంత రెల్లెయే లచ్చి తల్లివచ్చింది. సొప్పగూళ్ల తాన ఉంటనని సెప్పిండు సెంద్రుగాడు."

సొప్పగూళ్లతాన గడియలు లెక్కేసు కుంటకూసున్నడు సెంద్రుగాడు. కొద్ది ఛనాలకు ముంతల నీళ్లు పట్టుకొని ఆడి కొచ్చింది లచ్చి.

"ఏమే, కొత్తెద్దు బెదిరినట్లు బెదురు తానవ్. దగ్గరికి రారాదంట" కపిరిండు సెంద్రుగాడు.



"ఇవ్వుడు మా అయ్య మన్నెలో ఎరుక లేదా .....? నీకు."

"ఏమన్నడే....?" అంట గుడ్లు తిప్పుతూ అడిగిండు.

"అన్ని నా నోటికేయే సెప్పాలనుందా. ఈ యేడు మా లచ్మిపెళ్లి సెయాలన లేదా......?" జరంత గట్టిగ సెప్పింది.

"ఓహో గదా నీ అలుగుడు." అంట లేసి లచ్మి దగ్గరకుపోయి, నువ్వేం భయం పడకు లచ్మి. ఎన్నడో సెప్పినగాదే. నిన్నే సేసుకుంటానని. కావల్తే ఇప్పుడు గూడా దేవురిమీన ఇమానం, వమానం సెయ్య మంటె సేత్తా." అంట లచ్చి ముఖం మీాన్కి సూసిండు.

ఇమానం, వమానం అనంగనే లచ్మికి సాన నమ్మకం, ఇస్వాసం జేరింది. మెల్లంగ నగింది.

లచ్మి సేతులు పట్టు పట్టుకొని దగ్గ ఈడ్సుకున్నడు. "శిగ్గెందుకే, శిగ్గు శిన్నప్పుడేపాయె." అంట గట్టిగ శాతికి అతుకున్నడు మొసమర్రకుండ. నడుంమీాన సెయ్యేశి మీాన్ని లాకున్నాడు. మెల్లంగా కండ్లు తెరిశి "లచ్మి ఇయ్యాళ నేను, పోశిగాడు, మైసడు అందరం గూడి శీలుమకు పోతానం. నీకేం గావాలో సెప్పు" అంట అడిగిండు.

"నీకు ఏది ఇట్టమయితే, అదే తే" సెప్పింది లచ్మి.

"నా ఇట్టమేముంది. నీ ఇటంట్ట కావాల్నాయె......!"

"అయిదాన్కి......! వో తెల్లకోక పట్కరా."

"ఒక్కటేందే......? అసొంటియి పదిగల తెత్త. సానమైన ఇత్తా. తాజుమాలు కట్టిత్తా. దానిమీాన నీ బొమ్మను నిలబెట్టిత్తా. ఏం......? సెప్పు" అంట గట్టిగ ఒక్కసారి కుతిదీర పెదూలమీాన ముద్దెట్టుకున్నడు. లచ్మి ఇంటికెల్లింది. సెంద్రుగాడు లచ్మికేయిస్తూతూ, సూత్తూ నిల్సుండాడు.

* * *

దొరోరి ఇంటితాన కల్లామన్న అయిద పకారం పోశిగాడు, మైసడు, సెంద్రుగాడు సేరుకున్నరు. ఎల్తామూరా అంటె ఎల్తామంటూా నడిశిండ్లు.

మైసిగాన్కి సాన సంతోష్కమైతాంది. నేను శీలుమ సూత్తాననుకుంటూ నడ్తాండు పోశిగాన్కి తీరు, తీర్ల మోటారు బండ్లు, తీరుతీర్ల దుకాండ్లు, సూత్తాననుకుంటూ నడ్తాండు.

సెంద్రుగాడు సీన్నంగా నగిండు. మైసిగాడు సూసి "ఏందిరా నగుతానవ్" అంట అడిగిండు. బగ్గ నగిండు సెంద్రుగాడు. అద్దిసూసి ముగ్గురు గొల్లుమంట నగిండ్లు.

"మీారెందుకు నగుతాండ్లు" సెంద్రుగాడి పశ్న. "నువ్వు నగితే మేము నగినం" అంట సెప్పిండు పోశిగాడు.

"అట్టగాదురా పట్నాన ఆడపోరగాండ్లు సాన సక్కంగుంటరు. వోపారి ఏమైందంటే గిట్టనే నేను మన దొరోరి జీతగాడు కిట్టిగాడు నేను యిద్దరంగూడి శీలుమకు పోనం. బసెక్కతాన కిట్టిగాడు నుట్టు అంటు పెట్టుకున్నడు. అడనే బాజుకు వో పదిగల ఆడోళ్లునిలబడ్డరు. కిట్టిగాడు ఇడిశిన పొగ అళ్లకేయిపోతాంది. నదువుకుపోతాండ్లట్టున్నదీ. అందరితాన కితాబులున్నయ్. కిట్టిగాడు వోమాటన్నర్రా అండ్ల వో పొల్ల కస సక్కంగ, ఎర్రంగ బక్కగా ఉన్నది. అరె సెంద్రిగా పొల్ల సక్కంగున్నదిరా అనిగవు కాయొలె అనిండు కిట్టిగాడు. ఆడిమాటివి పొల్లమన నాగుబామోలె బుస్సుమంట లేసిందిరా. అయ్, ఇంకేమున్నది. ఇటు బాజుకో పది మొగపోరగాళ్లు కూసున్నలు. ఈడి మాటలు ఇంటనే ఆపోరగాండ్లు గొల్లుమంట నగిండ్లు. పాపం ఆ పొల్ల ముఖం ఇంత అయింద్రా. గిదే నా కిప్పుడు అది కచ్చింది.

"అన్నా....! కిట్టిగాడు ఇంతకంతకు రాలేదురో" అంట బొమ్మ లెగిరేశిండు పోశిగాడు.

"మరెనేమురో...."అంట మైసడు సుతేసిండు.

తారు రోడ్డుమీాన అడుగేత్తనే అందుకున్నడు మైసడు. ఎల్కారిక్ట్ లైట్లో మొసా నున్నయిగదరో, లైట్లకున్న బొరెయ్య రిచ్చికాలునూరు. గజ్జలు గల్లుమంట ఏగుతానయ్. మన ఎడ్లబండికి ఏగినట్లు."అంట అందు కున్నాడు పోశిగాడు.

శోవు అడ నిల్చున్నరు ముగ్గురు. మైసడు బగ్గసూత్తాండు. "అరేయ్, వోరి పోశా! ఈ సర్కార్ గోర్మెంటుకు తెలివే లేదురా. ఈ పూర్ల ఇన్నిన్ని సిమిటి సడక్ లు ఏసుకున్నలు. మన సడక్ లకు ఇవారకు రాళ్ల సాయె."

"నీ తెలివి పాడుకాను. మన ఇళ్లకే మోచ్చంలేదంటే సడక్ లకునూరు," అంటనే "వోరి మైసా అగో గా దొరలాగునూరు కాలుకే బిగుసుకున్నదిరా" అంట సెప్పిండు పోశిగాడు.

"వాని యవ్వా..... కింద కూసుండి లేత్తనే కుట్లూసిపాయె. ఏడికాడికి పట్టుకునే ఉండె. కాలెంత.....? పడుమెంత? సెప్పబట్టె. ఏం సక్కంగున్నర్రా. మనం కోడికోసి బూరుపీకి నిలబెడ్తె ఎట్టనో ఆడు గట్టనే ఉన్నర్రా" అంట అనిండు మైసడు.

"వోరి మైసా అగో సైకిల్ మీాన అడ పొల్ల కూసోసి తొక్కుతాందిరా" అం- నూయిచ్చిండు సెంద్రిగాడు.

మైసడు సూత్తనే వోరు తెర్సిండు. "ఆ....అదే మనూళ్లయితే సైకిల్ సూత్తనే అమడదూరం ఉర్కుతరు."

ఇంక కసముంగలికి నడిశిండ్లు. అడ సర్కారు మోటార్లు, నడ్తానయ్. పుట్ట మీాని శీమలు పోయినట్లే పోతానయో- మోటార్లు అనిండు మైసడు.

ఇదంతా సూత్తనే మైసనికి సానయిసిత్రంగా ఉన్నది. అంతా పరలోకంలాగ తోత్తాంది అడ్కి. అకిరికి సొరత్తా సేరుకున్నరు ముగ్గురు. వోతాన నిల్చుండి అంతా పరీచ్చగా సూత్తాండ్లు ముగ్గురీరులు. పోశి



గాడు పీన సోంచాయించి, సోంచాయించి అడి గిండు. సెంద్రిగాన్ని.

"అరే, సెంద్రిగా గాదుకాండ్ల అదే వద్తాంది. గేదుకాండ్ల అదే పోడ్తాంది. అది విన్ని దిక్కుల పోడ్తాదిరా." అడి పళ్ల సిన్నంగ సోంచాయించుకున్నడు సెంద్రుగాడు.

"ఓ గదారా లేడియు. అది ఏడన్నైన పోడ్తదిరా!"

"ఓరక్క అది ముత్తమంతె ఉండె. మునిశేమొశాన పెద్దంగుండె"

"గదేరా అళ్ల అండ్లనే కూసుంట రట. వాకు మన కిట్టిగాడు సెప్పిండు. మరి గట్టయిటే వోపిరి మనవూళ్లనూశిన, దొరతాన మేజామీన గినంటిదేఉండె. వే వేము పోడమని రెండేసీ మస్కల నడిగిన. అది ఎంతకూ పల్కుతలేదు. అకి రికి ముల్లు గ్రతోటి ఒక్కటి పెట్టిన. వింతకూ పల్కలె.అంతరెల్లమె దొరచ్చిండ్లు. వేను బైటి కెల్లిన."

ఐదు ధనాలకు సెంద్రుగాడు దుకాండ్లకుబోయి తెల్లకోక కొన్నడు. దోశ డన్ని మల్లెపూలు తీసుకున్నడు. ఇవినూత్తనే పోశిగాడు, మైసడు ఇవి ఎవ్వలికిరా అంట అడిగిండ్లు.





## తెల్లకోక

"మా ఇంట్లకు," ఎంటనే సెప్పిండు సెంద్రుగాడు.

మళ్ల వోరెత్తలేదు — పోశిగాడు, మైసడు.

మైసడు ఆకాసంమీనికి సూత్తూ, "వోరి పోశా, అగో మీనికేలి ఇమానం పోతాందిరా."

"ఏడరా?" అంట పోశిగాడు విక్కి విక్కి మీన్కి సూత్తాండు. "అగోరా గాదమూడు సుక్కల నడుమకేయిపోతాంది సూరు. ఆ.... ఆ......! సిన్నంగ బైటున్నది మన ఐడ్డీ దీనమోలె" అనిండు పోశిగాడు.

"అరేయ్ సెంద్రా శిలుమ సూసేది అడున్నదిరా?"

"వో ఇంకా పాన దూరం నడువాల్నాయి"

అంత రెల్లమె పర్కారు మోటార్లు, కావిగిరి మోటార్లు, రిచ్చికాలు, సైకిళ్లు, పాన ఐనయ్. మైసడు సూత్తూ, సూత్తూ "వోరి సెంద్రిగా ఈపప్పుళ్లతోటే సెంద్లిళ్ల సేసుకోవచ్చురా, ఈ సాన్నాయిలు, బాండ్లు, ఈటితోటి అక్కెరేలేదు." ఈడి మాటలు ఇంటనే సెంద్రుగాడు సిన్నంగ నవ్వుకున్నడు.

"ఇంకా అటు సూత్తాం పారా!" మెల్లంగ అనిండు పోశిగాడు.

"ఏపాసి అనిక్కి సూత్తాంతిరాదు."

సెంద్రుగాడు మైసనికి మాయిత్తూ, "అగోరా మైసిగట్టబోయేదాన్కి రైకమూడు. ఆ ముంగట ఏడికేసిందో, ఏముక మ్యారో. ఈ పంత ఈవలేసింది. ఐబ్బలన్నీ బైటనే. గాయిందాన్కి యిడికేత్తేందో" అంట అనిండు మైసడు.

"మన వూళ్లల్లె మంచిగుంటరు. మంచిగ మోసేతులదాక, కింద కదువు అగపడకుండ మంచిగా గట్టిగా గుంజి బిగేత్తరు. ఈళ్ల సూరు లోపల ఇంకేదో తెల్లది ఏసిండ్లు. రెండేత్తగూడ లోపల్ది ఈవలికి కన్పిత్తనే ఉండె. ఎన్నికతల బడితేందిరా. ఈళ్లకంటె మన పల్లెటూరోళ్లె పాన బలంగుంటరు." పోశిగాడు మురేశిండు.

"ఈ మాటయితే నియొద్దేరా!" అంట దాన్ని బలం పర్శిండు మైసడు.

దుకాండ్లు, బజార్లు సూత్తూ సూత్తూ శిలుమటాంక్‌కాడికి శేరుకున్నరు. కశేవు రాతులమీన కూసుండి సుట్టలు ఈవలికి లాగిండ్లు. మెల్లంగ అంటేసిండ్లు. ఒక్కొక్కనినోట్లకేయి ఇంజన్లకేయి పొగెల్లినట్లె ల్లతానయ్. తూములకేయి విల్లినట్లెళ్ల తాంది పూంచుడు. సెంద్రుగాడులేశి "గోడ కేశిన బొమ్మలు సూత్తాంపారా" అనిండు. "ఆనిక్కపోదామి అగుగ్గిసుట్టోడువని." అంట అట్లనే కూసున్నలు. అంతరెల్లమె అనంగ పోడా మెలెన్ వోడు అత్తాండు. మెల్లంగ అన్నడు సెంద్రుగాడు. "జేంజర్ తాగుదా మూరా" అని.

"అబో కొత్తలులేవు, జేంజరు తాగుతె పోగాక్కులేవాయి." అంట గుండెబాదుకున్నడు పోసిగాడు.

"అదెపోయి. కావనీళ్ల తాగుదాంపార అనిండు" మైసడు. "కావనీళ్ల తాగుతె శిలుమా టిక్కట్టుకు పాలవాయి" గట్ల పోశిగాని భయం.

మొదటాట ఒడిసింది. మంది బాగున్నలు. రెండో ఆటకు టిక్కట్లకొసాకు అంతా నిలబడ్డరు. ఆకిరిన సెంద్రుగాడు టిక్కట్టుకుపోయిండు. మైసిగాడు, పోశిగాడేమో వోతాన నిలబడ్డరు. సెంద్రుగాన్కి టిక్కట్టు దొర్కలే. అన్నే నిల్చున్నడు. పానమంది కూసున్నలు శిలుమల, "పర్కార్ రీల్ ఒడి శిందంటరో వోరి సెంద్రుగా అంట పెద్దంగ అరిశిండు మైసడు, కొద్ది ధనాలకు టిక్కట్లు తెచ్చిండు సెంద్రుగాడు. నత్తిమి బత్తిమి అంట ఉరికిండ్లు ముగ్గులు.

ముగ్గులు శిలుమలకూసున్నలు. పర్కార్ రీల్ ఒడిశి ఆట నడ్తాంది సూసినయున్ని అదికత్తె పాన సంతోష్కమైతాంది మైసనికి. ఇగ పోశిగాడు ఆట ఇష్టేట్టే, మీన తిరుగుతున్న పంకాలకేయి సూత్తాండు. ఇందేదో ఇకమతు ఉన్నదనుకుంటాడు అడు. ఇగ సెంద్రుగాడు ఇవారకు సూసినోడు జెరంత అనుభంగల్లోడు కొద్ది గంత తెలి శినోన్లా కూసున్నడు.

రొండో ఆట ఒడిశింది. ముగ్గురు ఈవలికి అచ్చిండ్లు. మల్లో దమ్ము పొట్ట శిండ్లు వోట్లే. ఇగ అందుకున్నలు పందు బాట.

ఏగిలి బారంగనే ముగ్గురు ఎడ్లగొట్టు కొని సెర్వుకట్టకిందికి నడిశిండ్లు. పొలాల గెట్లు పొంటి గొడ్లు మేత్తానయ్. మైసడు గొడ్లను అడ ఇడిశి పొలంకాడ్కిపోయిండు. పోశిగాడు దొరోరి పొలానికి నీళ్లుకట్ట బోయిండు. ఇగ ఆకిరికి సెంద్రుగాడు మిగి

సిందు. ఒక్కడే బొంయిగడ్డమీన కూనుండి ఆలోశన శేస్తాండు. నాత్రి సొప్పుగూళ్లతావకు అచ్చిన లచ్మి అదకచ్చింది. ఒక్కసారే కండ్లు మూసుకున్నడు. నా బంగారు లచ్మి, అన్నెల రాణి అయినులమొగ్గ అనుకున్నడు సెంద్రుగాడు. లోపల్నే సంతోష్కపడ్డడు. ఒక్కటే మాత్రము అడి మనసులో నాత్రినుండి మెదుల్తాంది. "ఎప్పుడు లచ్మి కలువాలె..? ఎప్పుడు తెల్లకోక యియ్యాలె" అంటపాన పొంతె కొట్టుకుంటాంది.

అంతల్నే పొలంకాడ్కిపోయిన మైన వచ్చిండు. ఇప్పుడే అత్తరా అంట మైనతో చెప్పి లచ్మికాడికి నడిసిండు సెంద్రుగాడు. మెల్లంగా దొరోరి పొలంకాడ్కి సేరుకున్నడు. ఎదురుంగ పోశిగాడు అగుపడ్డడు. పొలంతాన లచ్మి ఉన్నాదిరా అంట అడిగిండు సెంద్రుగాడు.

"అయ్యో.....! పొలంతాన పాగుంబాము కర్సిందట. వూళ్లకేసుకపోయిండ్లు ఇండ్ల" అంట సెప్పిండు పోశిగాడు.

అదిమాటలు ఇంటనే సెంద్రుగాడిపానాలు ఆకాసానికి సేరుకున్నయి. నా లచ్మి అంట పెద్దంగ అరిసిండు. చిన్న చిన్న వూళ్లకు ఉరికిండు.

అకిరిమీన ఆడుగొత్తనే గొల్లుమంట ఏడ్పులు ఇనిపిస్తినయ్. గుడ్సెలంగ సెంద్రుగాడు అందరినితోసుకుంట పోయిండు లోపలికి. అందరు పీన్గమీనపడి మొత్తుకొంటున్నరు. నా లచ్మి అంట పెద్దంగ అరిసి మీద పడి ఏడ్సిండు. ఒక్కచ్చనం లచ్మి ముఖం మీన్కి సూసిండు. ముకి ముకిగ వగుతూంది లచ్మిముఖం. పక్కంగ నిద్రబోయింది. లచ్మి ముఖం చూస్తుంటే సెంద్రుగానికి దుఃఖం ఇగ్గలేతాంది. ముఖంమీన ముద్దెట్టుకున్నడు.

జాము పొద్దెక్కింది. పీనుగకు తానం జేయించిండ్లు. అంత రెల్లమె సెంద్రుగాడు ఒక్క ఛనం మీన ఇంటికిబోయి తెల్లకోక తెచ్చిండు. తెల్లకోకను మాత్తనే అంత గొల్లుమంట మొత్తుకున్నరు. తెల్లకోక కట్టిండ్లు. తలకు మల్లెపూలు, దేవతోలె తెల్లంగ ఉన్నది. సెంద్రుగాని దుఃఖము ఆగుతలేదు. బోరున యేడ్సి శవంమీనబడి పెదూలమీన ముద్దెట్టుకున్నడు.

"ఒర్రెగడ్డమీన సమాధి శేయించిండ్లు. సెంద్రుగాడు ఒర్రెగడ్డతాన సమాధిమీన పండుకున్నడు. దుఃఖము ఆగొలె. పొర్లుకత్తాంది. సెంద్రుగాన్కి ఒక్కటేమాత్రం అది కచ్చింది. నా లచ్మి నిన్న ఇవారకు ఒర్రెగడ్డమీన కల్తనన్నది. ఇయ్యాల ఒర్రెగడ్డమీన వంటానికొచ్చినవా?" అంట ఏడ్సిండు.

ఎండకు అట్టనే ఏడుతూ సమాధిమీనే పండుకొని నిద్రబోయిండు.

"చరింగ నిన్న గివారకు గిదే ఎండ.....!"

ఆకాసంమీన సూర్యుడు శిన్నంగ, శిన్నంగ పొకుతాండు. ఎండ శాన ఏడిగా సంపుతాంది. ఆడగాలి రయ్యమంట ఊత్తాంది. ●






# ఫిలిప్స్ నొవోసోనిక్ రేడియోలు

★ అసామాన్య శబ్దగ్రహణము
★ అధునాతనమైన సాంకేతికాలు
★ సొమ్ముకు తగిన క్రొత్త రకములు



B6CA37A/01
PHILIPS
MAESTRO
రూ. 896/-



B5CA37A
PHILIPS
MAJOR
రూ. 645/-



B4CA39T
PHILIPS
TRANSISTOR
MINOR
రూ. 485/-
4 బ్యాండులు



B4CA57A
PHILIPS
MINOR
రూ. 485/-
4 బ్యాండులు —
6 వాల్వులు.



B3CA47U
PHILIPS
PHILETTA
SUPER
రూ. 325/-
3 బ్యాండులు —
5 వాల్వులు



L4CA38T/01
PHILIPS
TRANSISTOR
PORTABLE
రూ. 485/-
3 బ్యాండులు
లెదరు బ్యాగు
ఎక్స్ట్రా రు. 30

అనుమతి పొందిన సబ్ డీలర్లు:

1. విజయ ఎలక్ట్రానిక్స్, విజయనగరం.
2. వాణి రేడియో హోమ్, అనకాపల్లి.
3. శ్రీ వెంకటేశ్వర రేడియో హౌస్, నరసీపట్నం.
4. సరస్వతీ మ్యూజికల్ అండ్ ఎలెక్ట్రికల్స్, పార్వతీపురం.
5. సయ్యాదు రేడియో హౌస్, ఇచ్ఛాపురం

(పన్నులు అదనము.)

విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు అనుమతి పొందిన డీలర్లు:

## వైజాగు రేడియో కో.,

విశాఖపట్టణం — శ్రీకాకుళం.

టెలిగ్రాం: 'సౌండ్'

ఫోన్: 120
42

# చిత్రలహరి

## డాక్టర్ ఆనంద్

రవీంద్ర ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారి సాంఘికానికి "డాక్టర్ ఆనంద్" అని నామకరణం చేసినట్లు తెలుస్తున్నది. యన్. టి. రామారావు, అంజలీదేవి, కాంచన ముఖ్య భూమికలు పోషిస్తున్న యీ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకత్వం వహిస్తున్నారు. రచన: ఆత్రేయ, సంగీతం: మహదేవన్, నిర్మాత: డి. వి. రెడ్డి.

## మధు పిక్చర్స్

హిందీలో ఉత్తర భారతదేశమందంతటా ఘన విజయం సాధించిన "గృహస్థి" తమిళంలో "మోటార్ సుందరంపిళ్ళై" పేరుతో విడుదలయింది. చిత్రం హక్కుల్ని తెలుగులో పునర్నిర్మించేందుకు మధు పిక్చర్స్ వారు కైవశం చేసుకున్నట్లు తెలుస్తున్నది. ఇపుడు వారు ఒక జానపద చిత్రాన్ని కృష్ణకుమారి, కాంతారావులతో నిర్మిస్తున్నారు. రచన: రవికాంత్, దర్శకత్వం: బి. విఠలాచార్య. ఇది ఈనెలనుంచి ఆరంభించి సెప్టెంబరునాటికి పూర్తిచేసి విడుదల చేయాలనుకుంటున్నామనీ, దీని తరువాత "గృహస్థి" నిర్మాణం శ్రీ అక్కినేని నాగేశ్వరరావుతో అక్టోబరులో ప్రారంభించాలనుకుంటున్నామనీ—మధుపిక్చర్స్ అధినేత శ్రీ పి. మల్లికార్జునరావు యిటీవల తెలియజేశారు.

## ఖాను పిక్చర్స్

ఖాను పిక్చర్స్‌వారు విమాత్న నిక్కటబంధాలో ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించే యత్నాల్లో ఉన్నారు. కృష్ణకుమారి, కృష్ణంరాజు యీ చిత్రంలో ప్రధాన పాత్రధారులు. సంభాషణలు: మద్దిపట్లసూరి, సంగీతం: అశ్వత్థామ, కెమెరా: ఎం. కె. రాజు, నిర్మాత: జి. రామిరెడ్డి, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: కె. ప్రత్యగాత్మ.

## రజనీ ఫిలిమ్స్

"ఈడూ—జోడూ" చిత్రానికి ఛాయాగ్రహణ దర్శకత్వం వహించిన శ్రీ వి. వి. రావ్‌చౌదరి "రజనీ ఫిలిమ్స్" అనే సంస్థ స్థాపించి ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించాలనే తలంపులో ఉన్నారు. ప్రముఖ తారాగణం యీ చిత్రంలో పాల్గొంటారు. సంభాషణలు: పినిసెట్టి, సంగీతం: పెండ్యాల, నృత్యాలు: వెంపటిసత్యం, కళ: తోట, గీతాలు: కొసరాజు, కెమెరా: రావ్‌చౌదరి, దర్శకత్వం: కె. హేమాంబరధరరావు.

* * *

వేప చెట్టు నీడలో లాన్‌లో కుర్చీ మీద కూచుని కాఫీ సిప్ చేస్తున్నది జమున. ఆమెకు ఎదురుగా వున్న గార్డెన్‌లో పది మంది అబ్బాయిలూ, ఏడెనిమిదుగురు అమ్మాయిలూ (కాలేజి స్టూడెంట్స్ వేషాల్లో) ఉన్నారు. వారి చేతుల్లో పుస్తకాలు ఉన్నవి. కెమెరామన్ విన్సెంట్ లైటింగ్ సరిచూసుకుంటున్నారు. కాస్త ఎడంగా డైరెక్టర్ పెంజా గొడుగు కింద నిలుచుని షాట్‌కి ఎరేంజ్‌మెంట్స్ చేస్తున్నారు. సౌండ్‌బాక్స్‌లోంచి పాట వినిపిస్తోంది. ...తో పాటు నాథ్ పుంలో చెట్టు కింద కూచుని లిప్ మూవ్‌మెంటు యివ్వడం కోసం కాబోలు ఆ పాటపై దృష్టిని కేంద్రీకృతం చేశాడు. ఇదంతా చూస్తూ జమున కూచున్న వేపుకు వెళ్లాను. "అక్కడ ఎండగా వుంది. ఇలా నీడలోకి రండి!" అన్నదామె. థాంక్స్ చెప్పి ఆమెతో ముచ్చటిద్దామనుకున్నంతలో "డైరెక్టరుగారు పిలుస్తున్నారమ్మా" అంటూ ఎవరో వచ్చారు.

* * *

వివాహం అయినంతర్వాత జమున అందం మెరుగులు దిద్దుకొంది. ఆ నిండుదనమంతా ఆమెలో స్పష్టంగా గోచరిస్తున్నది. పచ్చరంగు నైలాన్ జార్జెట్ చీర కట్టుకొని, అదే రంగు జాకెట్ వేసుకున్నది. చీర మీద బంగారు రంగు జరీ పువ్వులు అక్కడక్కడా మెరుస్తున్నవి. కుడిచేతికి రెండు ముత్యాల గాజులు, ఎడంచేతికి స్క్వేర్ వాచి, రెండు జడలతో, హైహీల్ షూస్ వేసుకొని చేతిలో పుస్తకాలతో — "హంస నడకో" అంటారే, అలా నడచి వెళ్లింది గార్డెన్‌లోకి.

* * *

"హలో మేడమ్ సత్యభామ, పైన కోపం లోన ప్రేమ—నీవు నేను ఏకమైతే స్వర్గలోకం, నీవులేని జీవితం పెద్ద శాపం!" అంటూ హరనాథ్ జమున వెంటపడ్డాడు. ఆమెకి సిగ్గూ, కోపమూ వస్తున్నవి. మంచి మర్యాదా లేకుండా ఏమిటీ అల్లరి? అను



"లేతమనసులు" లో జమున, బేబీ పద్మిని.



"గూఢచారి ఏజంట్ 116" లో కృష్ణ, జయలలిత.

కుంది. అతని భారతం పట్టించుకొని వెంతకు రానిచ్చింది. గుప్పెడు నీళ్ళు అతని మొహం మీద చిలకరించి, చెంగున ఆ పక్కకి గెంతింది. హరనాథ్ తెల్లబోయాడు. వెనకనుంచి అతని స్నేహబృందం "శా, శా శా" అంటూ అరుస్తున్నది.

* * *

పై గీతాన్ని దాశరథి వ్రాశారు. ఏ. వి. యం. వారి "లేత మనసులు" చిత్రానికి సంబంధించిన యీ పాట చిత్రీకరణలో హాస్యనటుడు పద్మనాభం కూడ పాల్గొన్నారు. ఆయన ఒక బిట్‌లో 'సండే పిక్చర్, మండే బీచ్, ట్యూస్‌డే సర్కస్' అంటూ విద్యార్థి బృందం పీపుల మీద నుంచి టకటకా పడిచి వెళ్ళాలి. ఈ షాట్‌కు ఏర్పాట్లు జరుగుతున్నప్పుడు మేజర్ చంద్రకాంతలో నటిస్తున్న హాస్యనటుడు నాగేష్‌కి విరామం చిక్కినట్లుంది. అటు చేసి వస్తూ పద్మనాభంని చూసి "అయ్యో పద్మనాభం, అన్యాయమయ్యా, నీవు వాళ్ల మీంచి నడిస్తే చస్తారు!". అన్నాడు. సీరియస్‌గా. పద్మనాభానికిది వినపడినట్లు లేదు. వినిపిస్తే ఆయనా ఒక జోక్ విసిరి ఉండేవారు. అక్కడికి కాస్త దూరంగా ఫ్లోర్ నీడలో కూచున్న జమున దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చింది బేబీ రోజా రమణి. "ఏమిటి హడావుడి?" అంటూ నవ్వింది జమున.

* * *

బాలనటి బేబి రోజారమణి అంటే జ్ఞాపకం వచ్చింది. ఏ. వి. యం. వారు "లేత మనసులు" సాంఘికంతో పాటు "భక్తప్రహ్లాద" పౌరాణిక చిత్రం కూడ నిర్మిస్తున్నారు. ఇందులో రోజారమణి ప్రహ్లాద భూమికను పోషిస్తున్నది. జులై 13 వ తేది సాయంకాలం యీ చిత్రం రష్‌పెన్ తాలూకు కొన్నిభాగాలు చూశాము. ఇందులో నన్ను ఆశ్చర్యపరచిన అంశం ఏమిటి అంటే బేబీరోజారమణి నటన! ప్రహ్లాదుడిగా యీ చిన్నారి వ్యక్తపరచిన భావప్రకటన, సంభాషణ చెప్పేతీరు అపూర్వమైనవి. యస్. వి. రంగారావు వంటి నటుని ముందూ—భయకంపితులయ్యే సన్ని వేశాలలోనూ చెక్కుచెదరకుండా ఎంతో మనోనిబ్బరంతో నటించిన బేబీరోజా రమణిని చూసిన వారికి ఆశ్చర్యం కలుగక మానదు. అయిదేళ్ల యీ పసిదానిలో యింత నటన వున్నదా అనిపిస్తుంది. "భక్త ప్రహ్లాద" చిత్రం విడుదలానంతరరం బేబీ రోజారమణికి ఉజ్వల భవిష్యత్తు ఏర్పడుతుందనేది ఖాయం. ఏ. భీమ్‌సింగ్ దర్శకత్వాన ఏ. వి. యం. వారు నిర్మిస్తున్న మరొక హిందీ చిత్రంలో కూడా రోజా రమణి— నూతన్, సునిల్‌దత్‌ల పక్కన ముఖ్యభూమిక పోషిస్తున్నది.

* * *

"భక్తప్రహ్లాద" చిత్రం యింతవరకు పదకొండు రీళ్ళుపూర్తి చేసుకున్నది. ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడుతున్న యీ చిత్రంలో యస్. వి. రంగారావు, అంజలీదేవి, బేబీ రోజారమణి, హరనాథ్, బాల మురళీకృష్ణ, రేలంగి, పద్మనాభం, రమణా



'గూఢచారి ఏజంట్ 116'లో జయలలిత

రెడ్డి, ధూళిపాళ, మండ సుబ్బారెడ్డి, ఎల్. విజయలక్ష్మి, జయంతి, కనకం మొదలైన వారు నటిస్తున్నారు. సంభాషణలు: డి. వి. నరసరాజు, గీతాలు: సముద్రాల (సీనియర్), ఆరుద్ర, కొసరాజు, పాలగుమ్మి పద్మరాజు, సంగీతం: యస్. రాజేశ్వరరావు, కళ: ఏ. కె. శేఖర్, కెమెరా: విన్సెంట్, దర్శకత్వం: చిత్రపు నారాయణమూర్తి, బి. ఏ.

హిరణ్య కశిపుని కేవలం ఒక రాక్షస రాజుగా కాక, మానవత్వం వున్న వ్యక్తిగా ఒక కొత్త పంథాలో రూపొందిస్తున్నారు దర్శకులు శ్రీ నారాయణమూర్తి. పోతనామాత్యుని భాగవతంలో పద్యాలే యీచిత్రంలో ఉపయోగిస్తున్నారు.

—మోహన్‌కుమార్ ●



మంజులా సినీసిండికేట్‌వారి "కత్తిపోటు"లో వాణిశ్రీ, ఉదయకుమార్.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Phone: Editorial 21747; Other depts: 29766. Chief Editor: S. Sambhu Prasad.